వేదాలు పురాణాల ఆధారంగా

సమగ్ర ధర్మ ప్రయత్నా

# కల్కి అవతార్ & ముహమ్మద్ సాహబ్

సల్లల్లాహు అలైహి వ ఆలిహి వ సల్లం


రచయిత

డా. వేదప్రకాష్ ఉపాధ్యాయ

ఎం.ఏ (సంస్కృతం), డి.ఫిల్, డిప్లమా ఇన్ జర్మన్, ధార్మిక గ్రంథాల పండితులు



ప్రకాశకులు

సారస్వత్ వేదాంత్ ప్రకాష్ సంఘ్

ప్రయాగ్ (యు.పి.)


అనువాదం

మౌలానా గులామ్ నబిషా నక్షబంది

# ఇండియాలో ఇస్లామ్

మానవజాతి పితామహుడు ఆదమ్ అలైహిస్సల్లమ్‌కు అల్లాహ్ ఇస్లామ్ జ్ఞానాన్ని ప్రసాదించాడు. తాను సృష్టించిన వివిధ సృష్టితాల వల్ల వాటిల్లే లాభనష్టాలను ఎరుకపరిచాడు. ఆ పిదప ఆయన్ను స్వర్గానికి పంపించాడు. ఆదమ్ (అస) పక్కటెముకతో హవ్వా (అస)ను సృష్టించి వారిద్దరిని ఒక జంటగా చేసాడు. షైతాను కుట్రవల్ల వారిద్దరు ఒక పొరబాటు చేసారు. వారిద్దరిని అల్లాహ్ భూమిపైకి పంపించేసాడు. హజ్రత్ ఆదమ్ (అస) ముహర్రమ్ మాసం పదవతేదీ, శుక్రవారం రోజున భారత భూభాగంలో అంటే సరణదీప్ పర్వతంపై చేరుకున్నారు. ప్రస్తుతం శ్రీలంకలో ఉన్న ఈ భూభాగంలో ఆదమ్ అలైహిస్సల్లమ్ పాదముద్రలు, ఆదమ్ పర్వతం, ఆదమ్ బ్రిడ్జి చూడగలము. హజ్రత్ హవ్వా (అస) అరేబియా దేశంలోని జిద్దా ప్రాంతానికి పంపివేయబడ్డారు.

(చూడండి : అల్ ఖుర్ఆన్, అల్ బఖర 34-36, తఫ్సీర్ నయీమీ భాజిమ్ పేజి 330, దుర్రె మన్సూర్ వగైరా. అల్ హదీస్ తిబ్రాని (రివాయత్ ఇబ్నె అబ్బాస్, ఇబ్నె ఉమర్, ఇబ్నె సాద్, ఇబ్నె ఆసాకిర్ వగైరా) అబూ నయీమ్ వగైరా. అట్లాస్ అల్ ఖుర్ఆన్, దారుస్సలామ్, రియాజ్, జిద్దా, షార్జా, లాహోర్, లండన్, హోస్టన్, న్యూయార్క్, హిస్టరీ, ఇండియా & జాగ్రఫీ (ఉస్మానియా యూనివర్సిటీ), ఇస్లామిక్ ఎన్‌సైక్లోపీడియా, పేజి నెం.22)

## బైబిల్ (ఇంజీల్) ప్రకారం

- ఈసా (అస) ఏమన్నారంటే "అహ్మద్ (ముహమ్మద్ (స) నా తర్వాత భూమిపైకి రానున్నారు"
- ముహమ్మద్ (స) దైవప్రవక్తలకు ప్రవక్త, ఆయన దేవుని తరపున పంపబడిన చిట్టచివరి ప్రవక్త
- ముహమ్మద్ (స) యావత్తు మానవజాతికోసం పంపబడ్డారు.
- ముహమ్మద్ (స) గురించి కేవలం తౌరాత్, బైబిల్ గ్రంథాలలోనే కాదు అన్ని ధార్మిక గ్రంథాలలోను ప్రస్తావనలున్నాయి.
- ప్రవక్త సొల్మన్ (అస) తన వ్యాఖ్యలలో ప్రవక్త ముహమ్మద్ (స) పేరు ప్రస్తావించారు.
- ముహమ్మద్ (స) మక్కా ఎడారిలో జన్మిస్తారని ప్రస్తావనలున్నాయి.
- ముహమ్మద్ (స) ఫారాన్ కొండ నుంచి ప్రకాశిస్తారని ప్రస్తావనలున్నాయి.
- ముహమ్మద్ (స) రాక తర్వాత మునుపటి ధార్మికఆదేశాలన్నీ రద్దవుతాయి.
- సమస్త మానవజాతి ప్రవక్త ముహమ్మద్ (స) మార్గాన నడువాలి

"మేలుకుని ఉన్న వారు ఆదరణపొందుతారు. మత్తులో ఉన్న వారు కోల్పోతారు"

చూడండి : బైబిల్ : హాంగల్ 2:7.9, సాంగ్ ఆఫ్ సొల్మన్ 5:16, యెషయా 29:12 నుంచి 18, 21:13,17, 17:18, హబక్కూక్ 3:3 కెజెవి/ఎన్‌ఐవి, ఖుర్ఆన్ : 2:29, 146, 3:81, 7:157, 21:107, 25:1, 46:10, 53:2,3, 61:6 వేదాలు పురాణాల ఆధారంగా సమగ్ర ధర్మపరయత్నాలు

వేదాలు పురాణాల ఆధారంగా సమగ్ర ధర్మ ప్రయత్నాలు

# కల్కి అవతార్ ప్రవక్త ముహమ్మద్ (స)


రచయిత
డా. వేదప్రకాష్ ఉపాధ్యాయ
ఎం.ఏ (సంస్కృతం), డి.ఫిల్, డిప్లమా ఇన్ జర్మన్,
ధార్మిక గ్రంథాల పండితులు



ప్రకాశకులు
**సారస్వత్ వేదాంత్ ప్రకాష్ సంఘ్**

అనువాదం ప్రచురణ
**మౌలానా గులామ్ నబిషా నక్షబంది.**



Cell : 9391349104
www.ghulamnabishah.webs.com
e-mail : ghulamnabishah786@yahoo.com



రూ ॥ 20-00

## విషయసూచిక

# కల్కి అవతారం

సంస్కృత పండితులు వేద్‌ప్రకాష్ ఉపాధ్యాయ బెంగాలి బ్రాహ్మణ కుటుంబంలో జన్మించారు. సంస్కృతంలో సీనియర్ ప్రొఫెసర్‌గా అలహాబాద్ విశ్వవిద్యాలయంలో పనిచేసారు. తన పి.హెచ్.డి సిద్ధాంత వ్యాసంలో ఆయన స్పష్టంగా ప్రవక్త ముహమ్మద్ (స) వేదాల్లో పేర్కొన్న చిట్టచివరి కల్కిఅవతారమని పేర్కొన్నారు. వేదాల్లో చెప్పబడిన భవిష్యవాణుల్లోని లక్షణాలు, గుణగణాలు నూటికి నూరు శాతం ప్రవక్త ముహమ్మద్ (స)కు సరిపోలుతాయని ఆయన చెప్పారు. కాబట్టి హిందువులు వారెక్కడ ఉన్నప్పటికీ కల్కి అవతారం రాక గురించి వేచిఉండవలసిన అవసరం లేదని, నిజానికి కల్కి అవతారం ప్రవక్త ముహమ్మద్ (స) కాబట్టి ఇస్లామ్‌ను అనుసరించాలని ఆయన చెప్పారు.

అలహాబాద్ విశ్వవిద్యాలయం సంస్కృత ప్రొఫెసర్ డా. వేదప్రకాష్ ఉపాధ్యాయ సిద్ధాంత వ్యాసాన్ని ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన తొమ్మిది మంది మేధావులు ధృవీకరించారు. బిబిసి రేడియోలో ఈ సిద్ధాంత వ్యాసం 1997 డిసెంబర్ 8వ తేదీన ప్రసారమయ్యింది.

ఈ సిద్ధాంత వ్యాసం ఉర్దూ, హిందీ, తెలుగు, ఇంగ్లీషు భాషల్లోకి సియాసత్ దినపత్రిక యజమానులు మీర్ జాహిద్ అలీఖాన్ సాహెబ్, జహీరుద్దీన్ అలీ ఖాన్ సాహెబ్‌ల సహాయంతో అనువాదించబడింది. వారి సహకారం వల్ల దాదాపు పదిలక్షల కరపత్రాలు భారతదేశంలోను ఇతర దేశాల్లోను పంపిణీ చేయబడ్డాయి. కల్కి అవతార్ ముహమ్మద్ (స) పుస్తకం సంస్కృతం, హిందీ భాషల్లో మొదట రాయబడింది. తర్వాత ఇంగ్లీషు, ఉర్దూ భాషల్లోకి అనువదించబడింది. ఇప్పుడు తెలుగులో మీ ముందు సమర్పించడం జరుగుతోంది.

మానవజాతి సమస్తం కోసం దైవం పంపించిన చిట్టచివరి, సంపూర్ణ మార్గదర్శనం తీసుకువచ్చిన ఆఖరు ప్రవక్త ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లమ్ అన్న వాస్తవాన్ని చరిత్రలో అన్ని ధార్మిక గ్రంథాలు చాటి చెబుతున్నాయి. ప్రవక్త ముహమ్మద్ (స) క్రీ.శ. 571లో అరేబియా లోని మక్కా నగరంలో జన్మించారు. కాబట్టి ఆయన్ను విశ్వసించడం మానవాళికి ఎంతయినా అవసరం. సాఫల్యాన్ని పొందే మార్గం ఆయన చూపించిన మార్గమే.

సత్యమార్గానికి ఆహ్వానం

గులామ్ నబి షా నక్షబందీ

**షా ఎజుకేషనల్ సొసైటీ**

హైదరాబాద్-23 ఫోన్ : 9391349104

## ఈ పుస్తకం గురించి మేధావుల సమీక్షలు

**డా. గోవింద్ కవిరాజ్**

ఎం.ఏ., ఎం.ఏ.ఎం.ఎస్., హెచ్.ఎం.డి., పి.హెచ్.డి.
సర్వ దర్శన ఆచార్య, సాహిత్య ఆచార్య,
ఆయుర్వేద విజ్ఞాన్ ఆచార్య, వేద్ రత్న,
హిందీ సాహిత్య రత్న, వేదాంత శాస్త్రీ
ప్రొఫెసర్, వారణాసి సంస్కృత విశ్వవిద్యాలయం,
ప్రిన్సిపల్, నేపాలి సంస్కృత విశ్వవిద్యాలయం

పండిత్ వేదప్రకాష్ ఉపాధ్యాయ గారికి,
సరస్వతి వేదాంత ప్రకాష్ సంఘ్
ప్రయాగ

ఆర్యా,
"కల్కి అవతారం - ప్రవక్త ముహమ్మద్ (స)" పుస్తకాన్ని నేను చదివాను. ప్రస్తుతం మతాల మధ్య ఉన్న విభేదాలను తొలగించడానికి, మానవాళిని మానవీయ విలువల ఆధారంగా ఒక్కటి చేయడానికి మీరు చేసిన ఈ అలుపెరుగని ప్రయత్నం ఎంతయినా కొనియాడదగినది.

మీ

**గోవింద్**

---

**డా. శ్రీ గోపాల్ చంద్ మిశ్రా,**

ఎం.ఏ., పి.హెచ్.డి.,
ధర్మశాస్త్ర ఆచార్య, వేద్ ఆచార్య, వేద్ సెక్షన్ ఇంచార్జ్
సంస్కృత విశ్వవిద్యాలయం, వారణాసి.

పండిత్ వేదప్రకాష్ ఉపాధ్యాయ గారికి,
సరస్వతి వేదాంత ప్రకాష్ సంఘ్
ప్రయాగ

ప్రకృతిలో మానవులందరూ సమానులు. మానవులందరికీ ఒకే మాదరి భావావేశాలు ఉంటాయి. ప్రతి దేశానికి ఒక గొప్ప మనిషి అవసరం. అయితే ప్రతి గొప్పమనిషి ఒక అవతారం కాలేడు. ధార్మిక గుణగణాల ప్రకాశం లేని గొప్ప మనిషి అవతారం కాలేడు. ముహమ్మద్ (స) ఆయన దేశానికి ఉన్న అవసరాల రీత్యా ఒక గొప్పమనిషి మాత్రమే కాదు ధార్మిక గుణగణాల ప్రకాశం ఉన్న వారు కూడా. ఈ వాస్తవాన్ని గుర్తించడంలో ఎవరికి ఎలాంటి సంకోచం ఉండనవసరం లేదు. ఈ నేపథ్యం,

ఈ పరిస్థితుల రీత్యా ఆ ప్రాంతం ప్రజలు ఆయన్ను ఏవిధంగా చూసినా, ఇతర దేశాల ప్రజలు ఆయన గొప్పదనాన్ని తమ సంప్రదాయాలకు అనుగుణంగా ఆయన గొప్పదనాన్ని తమ పారిభాషిక పదాలతో అభివర్ణిస్తారు. ఈ పుస్తకంలో డా. వేదప్రకాష్ ఉపాధ్యాయ హిందూ అన్న పదం హిందూస్తానీ పదానికి అంటే ఇండియన్ అన్న పదానికి పర్యాయపదంగా చూపించారు. హిందూ, ముస్లిం రెండు విభిన్న సముదాయాలని మనం భావించినప్పటికీ వారందరూ ఒకే దేశానికి అంటే భారతదేశానికి చెందిన వారన్నది వాస్తవం.

ఈ సంబంధం వారి మధ్య సోదరభావాన్ని పెంచుతుంది. ఒకరినొకరు వ్యతిరేకించకుండా వారిలో మంచి ఆలోచనలను ప్రోత్సహిస్తుంది. ఒకరి సుఖదుఖాలలో మరొకరు భాగం పంచుకోనంత వరకు, ఒకరి భద్రత గురించి మరొకరు ఆలోచించనంత వరకు వ్యక్తిగత విభేదాలు సమసిపోవడం అన్నది జరగదు. భారతీయ హిందూ ముస్లిముల్లో అనేక ఉపవర్గాలు, సముదాయాలు ఉన్నాయి. అయితే చిన్న చిన్న విభేదాలు వారి సంస్కృతిపై ప్రభావం చూపడం లేదు. అంటే, హిందూ ముస్లిములందరూ అంతర్గతంగా సమైక్యంగానే ఉన్నారు. అదేవిధంగా ఒకవేళ మౌలిక విశ్వాసాల్లో విభేదాలున్నప్పటికీ హిందూ ముస్లిములు ఒకరి భద్రత, ఒకరి మేలు గురించి మరొకరు ఆలోచించడం ప్రారంభిస్తే, ఒకరి సుఖదుఖాల్లో మరొకరు భాగం పంచుకుంటే భయభీతుల వాతావరణం తొలగిపోయే రోజు ఎంతో దూరం ఉండదు.

శ్రేయోభిలాషి

4/11/1960

**గోపాల్ చంద్ మిశ్రా**

సంస్కృత విశ్వవిద్యాలయం 9, ఆధ్యాపక్ నివాస్

జగత్ గంజ్, వారణాసి

---

25, స్టాన్లి రోడ్, అలహాబాద్

తేదీ: 15/4/69

శ్రీ పండిత్ వేదప్రకాష్ ఉపాధ్యాయ ఇటీవల "కల్కి అవతారం - ప్రవక్త ముహమ్మద్ (స)" పుస్తకాన్ని ప్రచురించాలని భావించారు. ఈ పుస్తకం ప్రతిని నేను చూసాను. ఆయన ఒక మంచి విషయంపై పుస్తకం రాసారు. తీవ్ర పరిశోధన తర్వాత ఆయన ఒక నిర్ణయానికి వచ్చారు. ఆయన చేసిన ప్రయత్నం ఎంతయినా ప్రశంసించదగ్గది.

**ఎస్.పి.చతుర్వేది** ఎం.ఏ.,సంస్కృతం

వ్యాకరణ ఆచార్య, సంస్కృత విభాగం అధిపతి, ప్రయాగ విశ్వవిద్యాలయం.

అన్ని ధర్మాలు ఒకేవిధమైనవన్న ప్రాచీన విశ్వాసాన్ని ఈ పుస్తకం మరింత బలపరిచింది. కల్కి అవతారం, ప్రవక్త ముహమ్మద్ (స) మధ్య సారూప్యాలను చర్చించిన ఈ పుస్తకం పూర్తిగా వైదిక ధర్మంపై ఆధారపడిన పుస్తకం.

ఈ ప్రవక్త (కల్కి) ధార్మిక విజయాలు, అందుకు సాధనాలైన గుర్రాలు, ఖడ్గాలు, వాటి వర్ణనలు వీటి గురించి చదివిన వ్యక్తి, వేదాలపై విశ్వాసం ఉన్న వ్యక్తి ఎవరైనా సరే ఇదంతా గత చరిత్రలో భాగంగా భావిస్తాడే కాని ఇది భవిష్యత్తు దర్శనంగా భావించలేడు. ఈ పుస్తకం ద్వారా కల్కి అవతారం మన ప్రవక్త ముహమ్మద్ (స) ఒక్కరే అని రుజువు చేసింది.

ఈ వాస్తవానికి వేరే అధారాలు అవసరం లేదు. ఉపాధ్యాయ చేసిన ఈ ప్రయత్నం హిందూ ముస్లిం ఆలోచనల మధ్య విభేదాలను తొలగిస్తుందని ఆశిస్తున్నాను.

శ్రీ అశ్లోక్ తివారి

లావెడి, ఇటావా, ఉత్తరప్రదేశ్

సరస్వత్ ప్రయాగ ఎగ్జిక్యూటివ్ కమిటి సభ్యులు

సరస్వత్ వేదాంత్ ప్రకాష్ సంఘ్, అలహాబాద్ (యు.పి)

కల్కి అవతారం, ప్రవక్త ముహమ్మద్ (స)ల తులనాత్మక అధ్యయనానికి సంబంధించిన ఈ పుస్తకం నిస్సందేహంగా వినూత్నమైనది, సహేతుక వాదనలతో నిండిన పుస్తకం. హిందూ ముస్లింల విభిన్న ఆలోచనాపథాలను కలిపే ఒక సూత్రంగా ఇది ఉపయోగపడుతుందని ఆశిస్తున్నాను. అసహనం లేని కొత్త ప్రపంచాన్ని నిర్మించడానికి ఉపకరిస్తుందని భావిస్తున్నాను.

శ్రీ రామ్ భువన్ మిశ్రా

భజ్‌కోల్ హువా జిల్లా, మిర్జాపూర్, (యు.పి)

ఈ పుస్తకం కల్కి అవతారం-ప్రవక్త ముహమ్మద్ (స) చదివిన తర్వాత కల్కి అవతారం, ప్రవక్త ముహమ్మద్ (స) ఇద్దరూ ఒక్కటే అని నేను నమ్ముతున్నాను.

శ్రీ ఇందర్‌జిత్ శుక్లా బుర్ద్‌వాన్

పండిత్ వేద్‌ప్రకాష్ ఉపాధ్యాయ రాసిన తులనాత్మక అధ్యయనం కల్కి అవతారం-ప్రవక్త ముహమ్మద్(స) పుస్తకాన్ని నేను చదివాను. భారతదేశానికి చెందిన ప్రాచీన సాహిత్యం, ఇస్లామీయ సాహిత్యం ఈ రెండి తులనాత్మక అధ్యయనంతో చేసిన ఈ పరిశోధన కల్కి అవతరానికి సంబంధించి చాలా ముఖ్యమైన ప్రశంసనీయమైన పరిశోధన. ప్రస్తుత కాలంలో ధార్మిక విభేదాలను ఏకరువు పెట్టడం చాలా తేలిక కాని అలా చేయడం వల్ల ఎలాంటి ప్రయోజనమూ ఉండదు. యావత్తు ప్రపంచం ఒకే దేవుని విశ్వసించడం ద్వారా యావత్తు మానవాళిలో సోదరభావం వెల్లివిరుస్తుంది. ప్రేమాదరాల వాతావరణం ఏర్పడుతుంది. ఈ పరిశోధన అన్ని మతాల ప్రజలు ఇష్టపడతారని, అసహనం, మూఢవిశ్వాసాల చీకటి వదిలి విశ్వజనీన సోదరభావం వెలుగును స్వీకరిస్తారని ఆశిస్తున్నాను. ఆ విధంగా ఈ పుస్తకం ఒక గొప్ప ధర్మం గురించి తెలియజేస్తుంది.

ఈ పుస్తక రచయితకు మా శుభాకాంక్షలు

డా.రామ్‌సహాల్ మిశ్రాశాస్త్రి
బహదూర్ గంజ్, అలహాబాద్.

ఈ పుస్తకం చదివిన తర్వాత నాకు హిందూ ముస్లిముల మధ్య ఉన్న విభేదాలు మాత్రమే కాదు ప్రాచీన హిందుత్వ స్వభావం నాకు అర్థమయ్యాయి.

**లోగన్‌వాన్, కభియావు, అలహాబాద్**

విభేదాలను సమైక్యతా సూత్రాలతో ఒక్కటి చేసే ఇలాంటి పుస్తకం మరొకటి లేదు

**అశోక్ కుమార్ జైస్వాల్**

# పరిశోధనకు ఉపయోగపడిన పుస్తకాల జాబితా


సంస్కృతం :

1. రుగ్వేద సాహిత్యం 2. యజుర్వేద సాహిత్యం
3. సామవేద సాహిత్యం 4. అధర్వణవేద సాహిత్యం
5. శ్వేతోశ్వర ఉపనిషత్ 6. కెన్ ఉపనిషత్
7. వేదవ్యాసుని మహాభారతం 8. మహర్షి వేదవ్యాసుని శ్రీమద్భాగవతం
9. భవిష్యపురాణం 10. కల్కిపురాణం, మహర్షివేదవ్యాసుడు.
11. శ్రీమద్భగవద్గీత

హిందీ : 12. హిందూముసల్మాన్ ఏకతా, పండిత్ సుందర్‌లాల్‌జీ, హిందూస్తాన్ కల్చరల్ సొసైటి, మిట్టీగంజ్, అలహాబాద్ 13. ఖురానె మజీద్

ఉర్దూ & ఇంగ్లీష్ :

14. షమాయలె తిర్మిజి, మౌలానా ముహమ్మద్ జకరియా
15. సర్వరె ఆలమ్, ముహమ్మద్ ముస్లిమ్, జయ్యద్ ప్రెస్, కిషన్ గంజ్
16. సీరతున్నబి, షిబ్లినోమాని, సయ్యద్ సులైమాన్ నద్వి, మక్తబ మారిఫ్, ఆజమ్‌గఢ్
17. అషాఉస్సియార్, హాకిమ్ అబ్దుల్ బర్కత్ అబ్దుర్రవూఫ్, నూర్‌ముహమ్మద్, అసాహుల్ మక్తబ, కరాచీ
18. జమావుల్ ఫవాద్, సులైమాన్, ఆషిక్ ఇలాహీ ఖైరియా ప్రెస్, మీరట్
19. ముహమ్మద్ (స) అండ్ ముహమ్మదనిజం, రెవరెండ్ బోస్వర్త్ స్మిత్
20. రోమన్ ఎంపైర్ డిక్లయిన్ అండ్ ఫాల్, ఎడ్వర్డ్ గిబ్బన్, ఇ.పి.డిటాండ్ కంపని న్యూయార్క్
21. ది సెర్మన్ ఆఫ్ ముహమ్మద్, లేన్ పూల్, మెమిల్లన్ కంపనీ, లండన్
22. ఎన్‌సైక్లోపీడియా ఆప్ వరల్డ్ హిస్టరీ, డబ్ల్యు.ఎల్.లాంగర్, జార్జి జి. హార్ప్ అండ్ కంపనీ, అమెరికా
23. హిస్టరీ ఆఫ్ యానిషెంట్ ఇండియాస్ సివిలైజేషన్, ఆర్.సి.దత్, కిగాన్‌పాల్ ట్రెంచ్ టర్నర్ అండ్ కంపనీ, లండన్
24. అపాలజీ ఫర్ ముహమ్మద్, గాడ్‌ఫ్రే హిగ్గిన్స్, అలహాబాద్ రిఫార్మ్ సొసైటీ, దరియాబాద్
25. లైఫ్ ఆఫ్ ముహమ్మద్, సర్ విలియమ్స్ మ్యూర్, స్మిత్ ఎల్డర్ అండ్ కంపనీ, లండన్.

# ముందుమాట

ఈ పరిశోధనా వ్యాసంలో ప్రాచీన భారత కథనాలు, ఇస్లామీయ కథనాల సారూప్యాల గురించి చర్చించడం జరిగింది. ఇస్లామీయ కథనాలలో దైవ ప్రవక్తల భూభాగమే ప్రాచీన భారత కథనాలలోను కనబడుతుంది. ప్రవక్త ముహమ్మద్ (స) చివరి ప్రవక్తగా ముస్లిములు విశ్వసిస్తారు. అలాగే భారతీయ కథనాల్లో కల్కి అవతారాన్ని చిట్టచివరి అవతారంగా విశ్వసిస్తారు. ప్రవక్తలన్న పదం విదేశాలకు చెందిన ధార్మిక పురుషులకు వాడడం జరుగుతోంది. అవతారాలన్నవి భారతదేశానికి సంబంధించినవి. కాని యావత్తు భూమండలం దేవునికి చెందినది, ఇందులో సందేహం ఏమాత్రం లేదు. అన్ని దేశాల ప్రాచీన సాహిత్యంలోను ఆయా దేశాలను గొప్ప దేశాలుగా అభివర్ణించడం జరిగింది. భారతదేశమైన లేక మరో దేశమైనా ఆయా దేశాల ప్రాచీన సాహిత్యాల్లో ఆయా దేశాలను గొప్ప దేశాలుగా వర్ణించడం సహజంగానే జరిగింది. భారతీయుడు కాని మరొక దేశానికి చెందిన వ్యక్తి కాని ఎవ్వరు కూడా తన దేశాన్ని తక్కువగా చెప్పుకోవడం జరగదు. ప్రవక్తలు కేవలం అరేబియా దేశంలో ప్రభవించారు. ఇండియాలో కాదు అనడం కూడా అలాంటి వ్యక్తిగత అభిప్రాయమే. ప్రవక్త ముహమ్మద్ (స) చిట్టచివరి ప్రవక్త అని చదివిన తర్వాత నాకు భారతీయ పురాణాల్లోని కల్కి అవతారం గురించి లోతుగా అధ్యయనం చేయాలన్న కోరిక బలపడింది. భారతీయ కథనాల ప్రకారం కొన్ని యుగాలు గతించాయి. ఆ యుగాలలో, కల్కి అవతారం గురించి ప్రస్తావనలు, ఆ యుగంలో చోటు చేసుకున్న సంఘటనలు, ప్రవక్త ముహమ్మద్ (స)తో ఆయా ప్రస్తావనలను పోల్చడం ద్వారా కల్కి అవతారానికి సంబంధించిన ప్రస్తావనలు సరిపోలడాన్ని గమనించాను. కొద్దోగొప్పో తేడాలు శ్రీరాముడి కథలోను మనకు కనబడే చిన్న చితక తేడాల వంటివి తప్ప పెద్ద తేడాలేవి లేవు. ఈ విధమైన తేడాలను చాలా మంది హరి అనంతుడు హరి కథ అనంతమైనదని అభివర్ణించడం కూడా జరుగుతుంది. నేను కూడా అదేవిధమైన నమ్మకంతో ఈ పని ప్రారంభించాను. కల్కి చరిత్రను ఒక కథగా నేను భావించడం లేదు. కథ అన్నది కల్పితమైనది. వాస్తవాలు సత్యాల సూత్రాలను ఒక కథకు అన్వయించలేము.

అణుపరీక్షల విషయమై శాస్త్రవేత్తలు వెలిబుచ్చిన ఆందోళనలను ధార్మిక సమైక్యత ద్వారా మనం తొలగించవచ్చు. నీటిలో నివసిస్తూ మొసలితో వైరం అన్నది సాధ్యం కాదు. అందువల్ల నా పరిశోధనకు ప్రేరణ అన్నది ధార్మిక సమైక్యత మాత్రమే. జాతీయ సమగ్రతను కోరే వారికి నా ఈ వ్యాసం ఎంత మాత్రం అభ్యంతరకరమైనది కాదు. అసహనం ఉన్న వారికి మాత్రమే దీనిపై అభ్యంతరాలు కనబడతాయి. అలాంటి వారు తమ సంకుచిత కుహరాల నుంచి బయటకు వస్తే వాస్తవాలు బోధపడతాయి. దేవుని మాటలను ప్రచురించడానికి కేవలం దేవుని అనుమతి చాలు. ఈ భావాలతో నేను ఈ పరిశోధన ప్రారంభించాను. ఈ విషయంపై ఇంతకు ముందు ఎవరన్నా రాశారా లేదా అన్నది నాకు స్పష్టంగా తెలియదు. అయితే సర్వరె ఆలమ్ అన్న పుస్తకంలో కల్కి అవతారం, ప్రవక్త ముహమ్మద్ (స) ఇద్దరు ఒక్కటే అన్న సూచన కనబడుతుంది.
సర్వరె ఆలమ్ పుస్తక రచయిత ముహమ్మద్ ముస్లిమ్, జయ్యద్ ప్రెస్, కిషన్‌గంజ్, ఢిల్లీ ప్రచురించింది.

నా ఈ పరిశోధనా వ్యాసం భారతదేశం, విదేశాల ధార్మిక విషయాలను చర్చించిన వ్యాసం. ఎందుకంటే ఇదిదేవుని కృప వల్ల సాధ్యపడిన వ్యాసం. ఈ వ్యాసంలో కొన్ని ఆశ్చర్యకరమైన వాస్తవాలున్నాయి. ఇవి నా సొంత ఆలోచనలు కాదు. అవన్నీ వేదాలు, పురాణాల నుంచి గ్రహించిన కొటేషన్లు లేదా ధార్మిక ప్రేరణ వల్ల నాలో జనించిన భావాలు మాత్రమే. ఈ సిద్ధాంత వ్యాసాన్ని చదివిన తర్వాత ఒక సమైక్యతా పవనం కేవలం భారతదేశంలో మాత్రమే కాదు యావత్తు ప్రపంచాన్ని ఆహ్లాదపరుస్తుందని ఆశిస్తున్నాను. మతం పేరుతో మారణకాండలు ఆగిపోతాయని ఆశిస్తున్నాను. ప్రజలకు వివేకం, విజ్ఞానం, వివేచన లభిస్తే ప్రజలు ఒండొకరి పండుగల్లో పాల్గొంటారు. సమైక్యతకు ప్రతిరూపాలుగా మారుతారు. కేవలం పేరు వల్ల వ్యక్తి హిందూ ముస్లిం లేదా క్రిస్టియన్ కాదు. నేను సిరాజుల్‌హక్‌ను సత్యదీప్‌గా పిలిస్తే, అబ్దుల్లాను పండిత్ రామ్‌దాస్‌గా పిలిస్తే అలాగే అబ్దుర్రహీమ్‌ను భగవాన్‌దాస్ అని పిలిస్తే వారు బాధపడవలసిన అవసరం లేదు. ఆ పేర్లకు సంస్కృతంలో సముచిత అనువాదం అదే. అలాగే వారు నా పేరును అరబ్బీలో అనువదించాలనుకుంటే అలా చేయవచ్చు. నా పేరుకు అరబ్బీ అనువాదం నూరుల్‌హుదా. వివిధ మతావలంబీకులు ముఖ్యంగా హిందువులు ముస్లిములు మరోసారి సమైక్యం కావాలన్నది నా అభిలాష. ఈ వ్యాసం ప్రజల్లో శ్రేయోభిలాషను జనింపచేయాలన్నది నా కోరిక. ప్రపంచవ్యాప్తంగా సోదరభావం వెల్లివిరిస్తే అందరికీ అందరికీ ప్రయోజనం. కల్కి, ప్రవక్త ముహమ్మద్ (స) మధ్య సారుప్యాల ఈ తులనాత్మక అధ్యయాన్ని చదివిన తర్వాత కొందరికి కొన్ని అనుమానాలు జనించవచ్చు. ప్రవక్త

ముహమ్మద్(స) జీవిత చరిత్రను చదివిన తర్వాత కల్కి అవతారం అన్న కొత్త అవతారాన్ని సృష్టించి వుంటారని కొందరు భావించవచ్చు. అందుకే నేను ప్రాచీన పుస్తకాల నుంచి రిఫరెన్సులు ఇచ్చాను. అందులో కొన్ని పురాణాలు రాయబడిన కాలం నాటివి. సూతసూత్ర, ఉపనిషత్తులు, పురాణాల కాలం నిర్ణయించడానికి చరిత్రకారులు బహుశా అన్న పదాన్ని వాడారు. అంటే ఈ గ్రంథాల కాలం ఖచ్చితంగా చెప్పడం సాధ్యం కాదు. పురాణ కాలం గురించి గత పరిశోధకుల అభిప్రాయమేమన్నది మొదల పరిశీలించి ఆ తర్వాత పురాణ కాలం గురించి నా అభిప్రాయాలు వివరిస్తాను.

**డబ్ల్యు. ఎల్. లాగర్** అభిప్రాయం ప్రకారం పురాణకాలం అన్నది క్రీస్తు తర్వాత 400 సంవత్సరాల నుంచి ప్రారంభం అయ్యింది. ఆయన ప్రకారం రామాయణం, మహాభారతాలు క్రీ.శ.200లో రాయబడ్డాయి. అయితే లాంగర్ అభిప్రాయంలో క్రింది లోపాలున్నాయి.

**1.** రామాయణాన్ని రాసిన వాల్మీకి, మహాభారతాన్ని రాసిన వ్యాసుడు ఇద్దరు సమకాలీనులవుతారు. కాని వారిద్దరు సమకాలీనులు కాదు. వాల్మీకి ఎన్నడూ వ్యాసునికి సమకాలీనుడని భావించలేము. ఎందుకంటే వాల్మీకి రాముని యుగంలో నివసించిన వ్యక్తి. రాముడు వదలిన సీతను వాల్మీకి తన ఆశ్రమంలో ఆశ్రయమిచ్చాడు. కాబట్టి వాల్మీకి రాముని కాలంలో జీవించాడన్నది తెలుస్తోంది. అంతేకాదు వాల్మీకి రామకథను తన ఆశ్రమంలోనే పూర్తి చేసాడు.

**2.** రాముని కాలం త్రేతాయుగం. కాబట్టి రామాయణం కూడా త్రేతాయుగంలోనే రాయబడిందని చెప్పాలి. మహాభారతాన్ని వేదవ్యాసుడు ద్వాపర యుగంలో రాసాడు.

**3.** శుకరాజు క్రీస్తును కలిసిన సంఘటన భవిష్యపురాణంలో రుజువయ్యింది. ఈ శుకరాజు విక్రమాదిత్యుని వారసుడు. అంటే విక్రమాదిత్యరామాయణ కాలం, మహాభారత కాలం ఇవి పురాణాల కథాంశాలు.

కాబట్టి లాంగర్ అభిప్రాయాలు తప్పని తేలుతోంది.

**లాంగర్ స్టేట్‌మెంట్ :** పురాణాలు రాజులకు సంబంధించిన క్రమం లేని కథనాలు ఇందులో సంప్రదాయిక కథలు కూడా చోటు చేసుకున్నాయి. ఇవి ప్రస్తుతం ఉన్న రూపంలో క్రీ.శ.400లో రాయబడ్డాయి.

(ఎన్‌సైక్లోపీడియా ఆఫ్ వరల్డ్ హిస్టరీ, లాంగర్, పేజి 43)

మహాభారత కావ్యం అనేక మంది కవులు వివిధ కాలాల్లో రచించారు. బహుశా క్రీ.శ..200లో రాయబడి ఉండాలి. తర్వాత ప్రస్తుత కాలంలో రివైజు చేయబడి ఉండాలి. (ఎన్‌సైక్లోపీడియా

అఫ్ వరల్డ్ హిస్టరీ, లాంగర్, పేజి 42) భవిష్యపురాణం, ప్రతిసర్గపర్వం, త్రేతాయుగం, అధ్యయం దురిత్‌యుగం శ్లోకాలు 21, 22, 23, 31. భవిష్యపురాణం, ప్రతిసర్గ పర్వం, త్రేతాఖండం, అధ్యయం దురిత్యా, శ్లోకాలు 21

పానిని (300,350 సి) ఎన్‌సైక్లోపీడియా అప్ వరల్డ్ హిస్టరీ, లాంగర్ పేజి 62

బౌద్ధం ఈ కాలంలోనే స్థాపించబడింది. ఈ మతాన్ని స్థాపించింది సిద్ధార్థుడు. గౌతమ వంశానికి చెందిన పర్వతప్రాంత తెగ సాకియాకు చెందినవాడు.

(ఎన్‌సైక్లోపిడియాఅప్ వరల్డ్ హిస్టరి పేజి 41)

ఇక భాష విషయానికి వస్తే పురాణాల భాష ప్రాచీన భాష. ఈ భాష వ్యాకరణ ప్రతిబంధకాలు లేని భాష. సంస్కృత పదాలను స్వేచ్ఛగా వాడడం జరిగింది. ఈ కాలం వేదకాలానికి, సంస్కృత కాలానికి మధ్యకాలం. లాంగర్ ప్రకారం పురాణకాలం అన్నది గౌతమబుద్ధుడు పాళీ భాషలో, అంటే అప్పటి వ్యావహారిక భాషలో తన బౌద్ధధర్మాన్ని ప్రచారం చేసిన కాలం. బౌద్ధ గ్రంథాలు ఈ విషయాన్ని రుజువు చేస్తున్నాయి. ఎందుకంటే అప్పట్లో పాళీ భాష ఉత్థానంలో ఉండడం, సంస్కృత భాష పతనం కావడం ప్రారంభమయ్యింది. సంస్కృతం తర్వాత పాళీభాషల్లోకి మారడం ప్రారంభమయ్యింది. అది తర్వాత ప్రాకృత భాషగా ఆ తర్వాత అనేక మార్పులకు లోనయి చివరకు నేటి హిందిగా మారింది. కాబట్టి సంస్కృత కాలం గౌతమ బుద్ధుని కాలంగా భావించాలని లాంగర్ అభిప్రాయం. కాని ఏ భాష కూడా అతిత్వరగా మార్పు చెందడం అన్నది జరగదు. భాషలో మార్పులు రావడానికి వేలాది సంవత్సరాల కాలం పడుతుంది. గౌతమబుద్ధుని కాలంలో వ్యావహారిక భాషా వ్యాకరణం సంస్కృతంగానే ఉండింది.

ఆ తర్వాత వేయి సంవత్సరాలకు పయిమేని వ్యావహారిక భాషా వ్యాకరణాన్ని రూపొందించాడు. పయిమేని వ్యాకరణం వల్ల తెలుస్తున్న వాస్తవం ఏమంటే ఆ కాలంలో రాయడానికి వనరులు లేనందువల్ల కంఠస్థం చేయడం జరిగేది. కంఠస్థం చేయడానికి రాతపరమైన నియమాలు ఏవీ ఉండేవి కావు. పురాణాల భాష పయిమేని కాలానికి చాలా ముందునాటి భాష. పురాణాల్లో సంస్కృతపదాల వాడకం విస్తృతంగా ఉండడాన్ని చూస్తే ఇవి 1401 మధ్యకాలంలో రాయబడినవిగా కనబడుతున్నాయని చెప్పడం నమ్మశక్యంగా లేదు. ఈ మాటలకు ఆధారాలు లేనేలేవు. మేధావులందరూ ఈ విషయమై అనుమానాలు వ్యక్తం చేసారు. పైగా పురాణకాలం గురించి రాసేటప్పుడు బహుశా, కావచ్చు లాంటి పదాలు ఉపయోగించడం ద్వారా కాలనిర్ధారణ చేయడం కష్టమని

అంగీకరించారు. పురాణాల్లోని రాతల్లోని భాష, శైలి ఆధారంగా మనం ఆ కాలాన్ని అంచనా వేయడానికి ప్రయత్నిద్దాం.

భవిష్యపురాణం పద్దెనిమిది పురాణాల్లో ఒకటి. ఇందులో భవిష్యవాణులున్నాయి. భగవత్పురాణంలోని 12వ అధ్యయంలో కల్కి అవతారం గురించి ప్రస్తావన ఉంది. కల్కిఅవతారం గుణగణాల గురించి వర్ణన ఉంది. మొదటి అధ్యయంలోను 24వ శ్లోకంలో కల్కి ఆఖరి అవతారంగా ప్రస్తావన ఉంది. భవిష్యపురాణంలోను ప్రతిసర్గపర్వంలో వ్యాసుడు హజ్రత్ ఆదమ్(అస) నుంచి సంఘటనలను వర్ణించడం ప్రారంభించాడు. (భవిష్యపురాణం ప్రతిసర్గ పర్వం మొదటి అధ్యయం శ్లోకం 24)

పురాణాలు హజ్రత్ ఆదమ్(అస)కు ముందే రాయబడ్డాయని దీన్ని బట్టి తెలుస్తోంది. అంటే రెండువందల అరవై సంవత్సరాలు మాత్రమే ద్వాపరయుగం పూర్తవ్వడానికి మిగిలిఉన్నాయి. అప్పుడే హజ్రత్ ఆదమ్ (అస) జన్మించారు. కలియుగానికి సంబంధించి 5070 సంవత్సరాలు గతించిపోయాయి. అంటే హజ్రత్ ఆదమ్ (అస) 5070+2208 సంవత్సరాలకు పూర్వం జన్మించారు. ఆ కాలంలో రాయడం అన్నది కనుగొనబడలేదు. అందువల్ల శ్లోకాలను కంఠస్థం చేయడం జరిగేది. హజ్రత్ నూహ్ (అస) కాలంలో సంస్కృత భాష వాడకంలోకి వచ్చింది. ఎందుకంటే విష్ణువు ప్రసన్నుడై ఆయనకు పదాల రూపంలో సంస్కృత భాషను ప్రసాదించాడు. ఈ భాష మేచ్ఛ భాషగా పేరుపడింది. హజ్రత్ నూహ్ (అస)కు ముగ్గురు కుమారులు. వారు సామ్, హామ్, యాఫ్స్. ఇక్కడి నుంచి భాషా కుటుంబాలు ఏర్పడడం ప్రారంభమయ్యింది. సామ్ నుంచి సామీస్ భాష, హామ్ నుంచి హామీస్ భాషాకుటుంబాలు ఉనికిలోకి వచ్చాయి. పురాణ రచనా కాలం 7278 సంవత్సరాల పాతది. ఇది పూర్తిగా సాధ్యమయ్యే విషయమే. దీనిపై కొందరికి కొన్ని అభ్యంతరాలు ఉండవచ్చు. హజ్రత్ ఆదమ్ (అస)కు ముందు అంటే పురాణ కాలంలో నాలుగు కులాలు ఉండేవి. ఈ కులాలు వృత్తిరిత్యా ఏర్పడినవి. పుట్టుకరీత్యా కాదు. ఒక బ్రాహ్మణుడు శూద్రునిగా మారడానికి, ఒక శూద్రుడు బ్రాహ్మణునిగా మారడం అక్కడ సాధ్యమయ్యేది. దేవుడు అందరినీ సమానంగా సృష్టించిన తర్వాత కులాల రీత్యా భేదభావం చూపడం అన్నది ఎలా సాధ్యం. మానవులందరిలోను నడక, శరీరం, చర్మం, మాంసం, పొట్ట, ఆనందం, సుఖదు:ఖాలు అన్ని ఒక్కతీరుగానే ఉంటాయి. కులం రీత్యా ఇక భేదం ఉండడం ఎలా సాధ్యం. రుగ్వేద కాలంలో నాలుగు కులాలు ఉండేవి. అవి బ్రాహ్మణ, క్షత్రీయ, వైశ్య, శూద్ర కులాలు.

(భవిష్య పురాణం ప్రతిసర్గ పర్వం అధ్యయం 14, మొదటి, మధ్య, చివరి అధ్యయాలు, అధ్యయం 40) అయితే ఈ కులవర్గాలేవీ పుట్టుకతో ఆయా కులాన్ని పొందవు. కులం అన్నది ఆ మనిషి గుణగణాలు, ఆచరణల ఆధారంగా ఏర్పడుతుంది. ఒక మనిషి తనకు అనుకూలమైన కులాన్ని పొందగలడు.

కాబట్టి పురాణాల రచనా కాలం, ఆ కాలం నాటి సంఘటనలు, పరిస్థితుల వర్ణన ఎందుకవసరమైందంటే, పురాణాలను అర్థం చేసుకోవడం అంత సులభమైన విషయం కాదని చెప్పడానికి. భగవత్ పురాణంలోని ఒక అధ్యయంలో మొత్తం 18 పురాణాల శ్లోకాలన్నింటినీ క్రోడీకరించడం కనబడుతుంది. కాబట్టి పురాణాల్లోని ఒక్క శ్లోకాన్నయినా తగ్గించడం కాని లేదా పెంచడం కాని చేయలేడు.

ఇప్పుడు నేను దేవుని పేరుతో నేను అవతారం అన్న పదాన్ని వివరించడానికి ప్రయత్నిస్తాను. ఈ పని చేయాలని నన్ను ప్రొఫెసర్ సరస్వతీ ప్రసాద్‌జీ చతుర్వేది సూచించారు. సంస్కృత విశ్వవిద్యాలయానికి డిపార్టుమెంట్ హెడ్‌గా పనిచేసిన ఆయనకు, ఇంకా ఈ పనికి నన్ను ప్రోత్సహించిన స్వామిరమన్ గార్లకు నా కృతజ్ఞతలు.

**పండిత్ వేద్ ప్రకాష్ ఉపాధ్యాయ**
ఎం.ఏ.(సంస్కృతం, వేదాలు)
**సంస్కృత పరిశోధకులు, ప్రయాగ విశ్వవిద్యాలయం.**

# అవతారం అంటే

అవతారం అన్న పదానికి అర్థం భూమండలానికి రావడం. ఈశ్వరుని అవతారం అంటే అర్థం ఒక మహాత్ముడు ప్రజలందరికీ సందేశం అందించడానికి జన్మించడం. దేవుడు సమస్తాన్ని ఆవరించి ఉన్నాడు. దేవుడు ఒక ప్రదేశంలో ఉన్నాడని చెప్పడం, లేదా ఇక్కడ నుంచి అక్కడికి అక్కడి నుంచి ఇక్కడి వెళ్ళాడని చెప్పడం సర్వాంతర్యామిని పరిమితం చేయడం అవుతుంది. కొన్ని ప్రాంతాల్లో దేవుని కాంతి ప్రత్యేకంగా ప్రకాశిస్తుంది. కొన్ని ప్రాంతాల్లో అది దాగి ఉండవచ్చు. సూర్యుని కాంతి కొన్ని ప్రదేశాల్లో ప్రకాశించినట్లే ఇది కూడా. దేవుడు ఉండేది ఏడవ ఆకాశంలో, ఇది మనపై ఉన్న అన్ని ఆకాశాలపైన ఉన్న ఆకాశం. అక్కడ సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు ఏవీ ఉండవు. అక్కడ దేవుని కాంతి ముందు సూర్యచంద్రనక్షత్రాల కాంతులు వెలవెల బోతాయి. సూర్యుని కాంతి గ్రహాలను ప్రకాశించేలా చేస్తుంది. అలాగే దేవుని కాంతి సమస్తాన్ని ప్రకాశించేలా చేస్తుంది. దేవుని ప్రసన్నత పొందిన ఒక మహాత్ముడు ప్రజలకు ప్రయోజనం చేకూర్చడానికి భువిపై జన్మిస్తాడు. ఇక్కడి ప్రజలకు జన్మిస్తాడు. జ్ఞానసంపన్నుడై వస్తాడు. అతను దేవుని కాంతిని చూడగలుగుతాడు. విద్యాభ్యాసం లేకుండానే జ్ఞానాన్ని పొందగలుగుతాడు. ఈశ్వరుని అవతారం అన్న పదబంధంలో 'ని' అన్న అక్షరం దేవునికి అతనికి ఉన్న సంబంధాన్ని తెలుపుతుంది. ఆ మహాత్ముడు దేవునికి సంబంధించిన వాడు. ఆయన దేవుని విధేయుడు. రుగ్వేదంలో అలాంటి వ్యక్తిని 'కెన్' అని పిలువడం జరిగింది. కెన్ అన్న పదానికి అర్థం దేవుని స్తుతించేవాడు. అరబ్బీలో ముహమ్మద్ అన్న పదానికి అర్థం కూడా ఇదే. అయితే దేవుని స్తుతించేవారందరూ ముహమ్మద్ అవుతారా అన్న సందేహం రావచ్చు. కాని అలా జరగదు. ముహమ్మద్ లేదా కెన్ అన్న పదం ప్రత్యేకమైనది. దేవుని ప్రత్యేకంగా స్తుతించేవారిని ఉద్దేశించినది. ఈ పదం ప్రత్యేకమైన వ్యక్తి కోసం ఉద్దేశించినది. ఇది ఆ వ్యక్తి గుర్తింపును సూచించేది. హజ్రత్ ఆదమ్ (అస)కూడా దేవుని స్తుతించినవారే కాని ఆయన పేరు ముహమ్మద్ కాదు. కాబట్టి దేవునికి సంబంధించిన ప్రతి వ్యక్తి (శ్వేతశూత ఉపనిషద్ అధ్యయం 6 మంత్రం 14), దేవుని స్తుతించే ప్రతి వ్యక్తి కెన్ కాలేడు. ఇక్కడ మనం కేవలం ఆఖరు అవతారం గురించి మాట్లాడుతున్నాము. మనం ఆయన చరిత్ర గురించి చర్చించడం లేదు. లేదా మనం అవతారాల గురించి, ప్రవక్తల గురించి మాట్లాడడం లేదు. సంస్కృతంలో ఉన్న అవతార్ అన్న పదం ఇంగ్లీషులో ప్రవక్త అన్న పదం మాదిరిదే అన్న విషయాన్ని నేను ప్రత్యేకంగా చెప్పదలిచాను. విభిన్న దేశాలకు

భిన్న అవతారాలు ఉన్నాయి. ఎందుకంటే ఒకే అవతారం అన్ని దేశాలకు మార్గదర్శనం చేయడం సాధ్యం కాదు. కాని చివరి అవతారం ప్రత్యేకమైనది. ఆయన అవతరించి నప్పుడు ఆయన ధర్మం మిగిలిన ధర్మాల కన్నా ఉన్నతమైనదిగా మారుతుంది. ఇప్పుడు మనం చివరి అవతారం గురించిన కారణాల గురించి ఆలోచిద్దాం.

(రుగ్వేదం 2-12-6, హిందూ ముస్లిమ్ ఏకతా మో సుందర్జీ పేజి 26-30)

# అవతారాలకు కారణాలు

1. ప్రజలు ధర్మానికి దూరం కావడం, ప్రజలలో ధర్మం పట్ల ఆసక్తి లేకపోవడం
2. స్వచ్ఛమైన ధర్మంలో మార్పులు చేర్పులు జరగడం.
3. మతం పేరుతో మతానికి విరుద్ధంగా వ్యవహరించడం.
4. మతం పేరుతో మతానికి వ్యతిరేకంగా ప్రజల్లో ప్రచారం చేయడం
5. దైవదాసులను ఇబ్బందులకు, వేధింపులకు గురిచేయడం.
6. దౌర్జన్యాలు పాపాలు పెరగడం
7. అరాచకం అలుముకోవడం, హింసాదౌర్జన్యాలు మితిమీరడం
8. మతాన్ని వ్యక్తిగతానికి, కుటుంబానికి మాత్రమే పరిమితం చేసుకోవడం.
9. దైవం ప్రసాదించిన వస్తుసంపదను దుర్వినియోగపరచడం.
10. సాధువులు సంరక్షించడానికి, పాపులను తొలగించడానికి అవతారాలు భూమిపైకి రావడం జరుగుతుంది.
11. మతం పతనమయ్యే పరిస్థితి తలెత్తినప్పుడు అవతారాలు భూమిపైకి రావడం జరిగింది.
12. హింస, హత్యలు, దోపిళ్ళు అధికమైనప్పుడు అవతారాలు జన్మించడం జరిగింది.
13. యుగధర్మానికి అనుగుణంగా చోటుచేసుకునే మార్పుల దృష్ట్యా మతంలో మార్పులకు అవతారాలు రావడం ధార్మికనియమాలకు కొత్త రూపునివ్వడం జరిగింది. పైన పేర్కొన్న కారణాలు ఉన్నప్పుడు అవతారపురుషులు జన్మించారు.

# చివరి అవతారపురుషుని రాకకు కారణాలు

అవతారపురుషులు జన్మించడానికి కారణాలు క్లుప్తంగా చెప్పుకున్న తర్వాత ఇప్పుడు చివరి అవతార పురుషుని రాకకు కారణాలు చర్చిద్దాం.

1. బర్బరిజం ప్రాబల్యం వహించడం. ప్రజలు వ్యక్తిగత స్వార్థానికి ప్రాధాన్యం ఇచ్చి ఇతరుల జీవితాలకు ఏమాత్రం ప్రాముఖ్యం ఇవ్వని దౌర్జన్యకరమైన ధోరణి ప్రబలం కావడం. పాలకులు, రాజుల్లో చెడు అలవాట్లు, శిస్తుల భారం పెంచడం. సత్యధర్మ ప్రచారకులను రాళ్ళతో కొట్టి చంపడం
2. చెట్లు చేమలు వృద్ధి చెందకపోవడం. పండ్లు ఫలాలు పుష్పాలు ఉన్నప్పటికీ అవి చాలా అరుదుగా లభ్యం కావడం.
3. నదీజలాలు ఎండిపోవడం
4. అన్యాయాలు అధికం కావడం. ఇతరులను చంపి వారి సంపద కాజేయడం. ఆడపిల్లలను హతమార్చడం. వారిని సజీవంగా కొనుగోలు చేయడం.
5. అసమానతలు పెరగడం. సమానత్వం మృగ్యం కావడం. నిమ్నోన్నతభావాలు, అంటరానితనం పెరగడం.
6. దేవుని వదిలి ఇతరులను ఆరాధించడం. ఈ విశ్వానికి ఒక్కడే దైవం అన్న మాటలో ఎలాంటి సందేహమూ లేదు. కాని ఆ ఏకైక దేవుని ఆరాధనను వదిలి ఇతర దేవీ దేవతలను ఆరాధించడం. చెట్లను, నక్షత్రాలను దేవుళ్ళుగా భావించడం.
7. చెడు మంచి రూపంలో ప్రజలను భ్రమలకు గురిచేసి చివరకు వారిని నాశనం చేయడం. ఈ దుష్టశక్తి మానవాళికి రహస్య శత్రువు
8. స్వార్థం, కామం పెరగడం. పరస్పర సహకార భావం లోపించడం. ఒకరినొకరు శత్రువులుగా భావించడం. దేవునిపై విశ్వాసం సన్నగిల్లడం. ధార్మికులుగా చలామణి కావడానికి ప్రదర్శనాబుద్ధి పెరగడం.
9. న్యాయం పేరిట అన్యాయానికి పాల్పడడం. న్యాయానికి దూరమై అన్యాయాల పట్ల ఆసక్తి పెంచుకోవడం.
10. సాధువులు, మంచివాళ్ళను రక్షించడానికి చివరి అవతారపురుషుడు జన్మించాడు.
11. దైవాదేశాలను ఆచరించాలన్న స్ఫూర్తి ప్రజల్లో కొరవడడం. వేదాల పట్ల గౌరవం తగ్గడం, ఆయా ఆదేశాలను లక్ష్యపెట్టకపోవడం.

# చివరి అవతార పురుషుని గుణగణాలు

1. **గుర్రపు స్వారి** : చివరి అవతారపురుషుని గురించి ఎప్పుడు ప్రస్తావన వచ్చినా ఆయన అశ్వారూఢుడని, ప్రయాణ సాధనంగా గుర్రాన్ని వాడారని తెలుస్తుంది. ఆయన గుర్రాన్ని స్వారిచేస్తూ వస్తాడని ప్రస్తావనల్లో కనబడుతుంది. ఆ గుర్రం పేరు 'దేవదత్'గా కూడా ప్రస్తావనల్లో ఉంది. ఆ పేరుకు అర్థం దేవతలు ఇచ్చిన వాహనమని అర్థం

2. **కత్తిసాములో మేటి** : చివరి అవతారపురుషుని గురించి కనబడే ప్రస్తావనల్లో ఆయన కత్తిసాములో మేటి అని కూడా మనకు తెలుస్తుంది. శత్రువులు ఖడ్గప్రహారాలతో నిర్మూలించబడతారని ప్రస్తావనల్లో ఉంది. అంతేతప్ప అణుబాంబుల వల్ల అని కాదు. అయితే ఈ విషయమై మనం ఆలోచించవలసిన అవసరం ఉంది. ఎందుకంటే ప్రస్తుత కాలం అణుయుగం అంతే కాని ఖడ్గయుద్ధాల కాలం కాదు. ఇంకా చివరి అవతారపురుషుని లక్షణాలు పరిశీలిస్తే ఆయన వస్త్రధారణ ఆ కాలానికి, ప్రదేశానికి, అప్పటి సంప్రదాయాలకు తగినట్లు ఉంటుందని తెలుస్తోంది. ఆయన తాను జన్మించిన సముదాయం వారి వ్యవహారశైలి కలిగి ఉంటారని కూడా తెలుస్తోంది.

3. **మొత్తం ఎనిమిది గుణగణాలు కలిగి ఉండడం** : పురాణాలు ఈ అవతారపురుషుని ఎనిమిది గుణగణాలను వర్ణించాయి. అవన్నీ చివరి అవతారపురుషునిలో కనబడతాయి.

4. **ప్రపంచ పరిరక్షకుడు** : జగత్పతి అనగా ప్రపంచాన్ని రక్షించేవాడని అర్థం

5. **దుర్మార్గులను అణచడం** : చివరి అవతారపురుషుని గుణగణాల్లో ముఖ్యమైనది ఆయన దుర్మార్గులను అణచివేస్తాడు. మంచివారిని రక్షిస్తాడు.

6. **నలుగురు సహచరుల సహకారంతో పనిచేస్తాడు** : భారత్ అనగా సహాయం చేసేవాడని అర్థం. చివరి అవతారపురుషునికి నలుగురు సహాయకులు ఉంటారు. వారు ఆయనకు అన్ని విధాల సహాయసహకారాలు అందిస్తారు.

7. **దేవతల సహాయం** : స్వర్గంనుంచి దేవతలు దిగివచ్చి ధర్మప్రచారానికి, దుష్టశిక్షణకు సహాయపడుతారు. (కల్కిపురాణం, అధ్యయం 2, శ్లోకం 15)

8. **కలిని నిరోధించడం** : కలి లేదా సాతాన్‌ను నిరోధిస్తారు.

9. **చివరి కాంతి** : చివరి అవతారపురుషుని కాలంలో ఏ కాలంలోను లేనంత

ప్రకాశవంతమైన కాంతి ఉంటుంది. అలాంటి ప్రకాశం మరే అవతారపురుషునికి లేదు.

10. **రాజుల రూపంలో ఉన్న దోపిడీ దారులను నిర్మూలించడం** : రాజుల రూపంలో ఉన్న దోపిడీదారులందరిని చివరి అవతారపురుషుడు నిర్మూలిస్తాడని భగవత్ పురాణం చెబుతోంది. (భగవత్ పురాణం 12-2, 16, ప్రపంచ పరిరక్షకుడు ఎనిమిది ప్రత్యేక గుణగణాలను కలిగి ఉంటాడు. దేవతలు ఇచ్చిన శరవేగంగా వెళ్ళే గుర్రాన్ని స్వారి చేయడం, తన కరవాలంతో దుర్మార్గులను అంతం చేయడం, రెండవ, నాలుగవ, ఐదవ గుణాలను భగవత్ పురాణం వర్ణించింది. కల్కి పురాణం, అధ్యయం 2 శ్లోకం 5 : "ఓ దైవమా! నేను నలుగురు సహచరులతో కలిసి దుష్టశక్తిని నాశనం చేస్తాను(12-2,16)" భగవత్ పురాణం 12-2,20, శరవేగంగా పరుగెత్తే గుర్రంపై స్వారీ చేస్తూ అయన, సాటిలేని ప్రకాశం కలిగిన అయన రాజుల రూపంలో ఉన్న దోపిడీగాళ్లను నిర్మూలిస్తాడు)

11. **శరీర సువాసన** : చివరి అవతార పురుషుని శరీర సువాసన వాతావరణాన్ని అలుముకుని ప్రజల హృదయాలలో పరివర్తన తీసుకువస్తుంది.

12. **అతిపెద్ద సమాజానికి బోధకుడు** : చివరి అవతార పురుషుడు అతి పెద్ద సమాజానికి, సముదాయానికి బోధకునిగా ఉంటారు. ధర్మానికి దూరమైన వారిని శిక్షిస్తాడు. వారిని సన్మార్గానికి తీసుకువస్తారు.

13. **మాఘమాసం 12వ రోజున జన్మిస్తారు** : చివరి అవతారపురుషుడు మాఘమాసం శుక్లపక్షం 12వ తేదీన జన్మిస్తారని కల్కి పురాణం చెబుతోంది.

14. **శంభల్‌కు చెందిన అత్యున్నత పూజారి కుటుంబంలో జన్మిస్తారు** : ఆయన జననం శంభల్ ప్రాంతంలో విష్ణుప్రకాశం కలిగిన ఒక పెద్ద పూజారి కుటుంబంలో సంభవిస్తుంది. ఆయన తల్లి పేరు సుమతి. ఈ లక్షణాలన్నీ చివరి అవతారపురుషునికి సరిపోలుతాయి.

(1. భగవత్ పురాణం సంపుటం 12, అధ్యయం 2, శ్లోకం 21

2. కల్కి పురాణం అధ్యయం దాక్తియా శ్లోకం 15

3. భగవత్ పురాణం 12-2,16

4. కల్కి అధ్యయం 2 శ్లోకం 4, 11)

# చివరి అవతార పురుషుని కాలం

భారతదేశంలోని ధార్మిక గ్రంథాలు నాలుగు తరగతులుగా ఉన్నాయి.

1. సత్యయుగం : ఈ యుగ కాలం 17,28,000 సంవత్సరాలు
2. త్రేతాయుగం : సత్యయుగం తర్వాత త్రేతాయుగం వచ్చింది ఈ యుగం 17,28,000 సంవత్సరాలు
3. ద్వాపరయుగం : త్రేతాయుగం తర్వాత ద్వాపరయుగం 8,64,000 సంవత్సరాలు
4. కలియుగం : ఈ యుగం 4,30,000 సంవత్సరాలు

అవతార పురుషుని రాకకు ముందు భూమండలం, ప్రజలు దౌర్జన్యాలు, అన్యాయాలతో సతమతమైపోతారు. ఆ తర్వాత అవతారపురుషుని ఆగమనం జరుగుతుంది. ఈ విషయమై భగవద్గీత ఏమంటుందంటే

పాదసూచికలు : రుగ్వేదం 10-60-12, అధర్వణవేదం 16-1, 6, 31-11,3-12-5

ఎప్పుడెప్పుడు అన్యాయం ప్రపంచంలో అధికమవుతుందో అప్పుడు శిష్టరక్షణకు, దుష్టశిక్షణకు అవతారపురుషుడు జన్మిస్తాడు. సత్యధర్మ స్థాపనకు ఉపక్రమిస్తాడు (భగవత్‌పురాణం సంపుటం 12, అధ్యయం 2, శ్లోకం 17). ఇప్పుడు పరిశీలించ వలసిందేమిటంటే ఈ పరిస్థితులు ఈ యుగంలో గడిచిపోయాయా లేక గడుస్తున్నాయా అన్నది.

కలియుగంలో చివరి అవతారపురుషుడు జన్మిస్తాడన్నది తథ్యం. కలియుగం 5071 సంవత్సరాల పూర్వం ప్రారంభమయ్యింది. చివరి అవతారపురుషుడు కలియుగం ప్రారంభమై కొంతకాలం గడిచిన తర్వాత జన్మిస్తాడు. అంటే పరిస్థితులు పూర్తిగా దిగజారి మనిషికి పట్టెడన్నం కూడా లభించని దయానీయ స్థితి నెలకొన్నప్పుడు.

ఇక్కడ గమనించవలసిన మరో ముఖ్యమైన విషయమేమంటే, చివరి అవతారపురుషుడు యుద్ధాల్లో ఖడ్గాలు ఉపయోగిస్తున్న కాలంలో, ప్రయాణానికి గుర్రాలు ఉపయోగిస్తున్న కాలంలో జన్మిస్తాడని భగవత్‌పురాణం స్పష్టంగా పేర్కొంది. ప్రపంచ పరిరక్షకుడు శరవేగంగా పయనించే గుర్రంపై, దైవదత్తమైన ఖడ్గంతో, ఎనిమిది దైవిక లక్షణాలతో శత్రువులను అంతం చేస్తాడని ఉంది. ప్రస్తుత కాలం గుర్రాలు, ఖడ్గాల కాలం కాదు. ఇది అణుబాంబులు, యుద్ధట్యాంకుల కాలం. గుర్రాలు, ఖడ్గాల కాలం గతించింది. కాబట్టి చివరి అవతారపురుషుడు ఆ కాలంలో జన్మించి ఉండాలి. యుద్ధాల్లో ఖడ్గాలు,

గుర్రాల ఉపయోగం అన్నది నేటికి 1400 సంవత్సరాల క్రితం జరిగేది. ఆ తర్వాత 100 సంవత్సరాలకు గన్‌పౌడర్ అరేబియాలో కనుగొనడం జరిగింది. గన్‌పౌడర్‌ను బొగ్గు, సోడా మిశ్రమంతో తయారు చేసేవారు. ఇక్కడ మరో ముఖ్యమైన విషయమేమంటే, చివరి అవతారపురుషుని జననం తేదీ కూడా కల్కిపురాణం పేర్కొంటోంది. మాధవమాసం, శుక్లపక్షం, 12వ తేదీగా పేర్కొంది.

1. గత్‌కాలి 5069 పంచాగం 2025
2. భగవత్‌పురాణం సంపుటం 12, అధ్యయం 2, శ్లోకం 17
3. భగవత్‌పురాణం సంపుటం 12, అధ్యయం2 శ్లోకం 19
4. కల్కి పురాణం అధ్యయం 2, శ్లోకం 15

## జన్మస్థానం

చివరి అవతారపురుషుని జన్మస్థానం శంభలి గ్రామం అన్న ప్రస్తావన స్పష్టంగా ఉంది. అయితే కేవలం పేరు ఒక్కటి తెలిసినంత మాత్రాన చాలా మందికి సంతృప్తి కలుగదు. మరిన్ని వివరాలు అవసరం అవుతాయి. శంభలి అన్నది గ్రామం పేరా? లేక గ్రామానికి సంబంధించిన వర్ణనా? అన్నది తెలుసుకోవలసి ఉంది. శంభల్ అన్నది గ్రామం పేరు అని చెప్పలేము, ఎందుకంటే ఒక ప్రత్యేక గ్రామం పేరయినట్లయితే ఆ గ్రామం ఎక్కడ ఉన్నదో ఆ వివరాలు కూడా ఉండేవి. కాని పురాణాల్లో ఎక్కడ కూడా ఆ గ్రామం ఎక్కడ ఉన్నదో భౌగోళిక వివరాలు చెప్పడం జరగలేదు. భారతదేశంలో శంభల్ అన్న పేరుతో ఏదన్నా గ్రామం ఉన్నదా అని వెదికినా, 1400 సంవత్సరాల క్రితం పురాణాల్లో పేర్కొన్న లక్షణాల వంటి లక్షణాలున్న వ్యక్తి ఎవరయినా జన్మించారా అని వెదికినా మనకు నిరాశా మిగులుతుంది. చివరి అవతారపురుషుడు సాధారణ మానవుడు కాదు. ఎందుకంటే అలాంటి కారణజన్ముడు జన్మించిన తర్వాత సమాజంలో గొప్ప మార్పులు రాకుండా ఉండడం అన్నది జరగదు. కాబట్టి శంభల్ అన్నది గుణవిశేషాన్ని తెలిపే ఒక వర్ణన మాత్రమే తప్ప అది నామవాచకం కాదు. అంటే అది ఒక ప్రత్యేక గ్రామం పేరు కాదు. శంభల్ అన్న పదానికి అర్థం పరిశీలిస్తే శాంతినిలయం అని తెలుస్తుంది. మరో అర్థం ఏమంటే నీటివనరులకు దగ్గరగా ఉన్న ప్రాంతం అని కూడా తెలుస్తుంది. చాలామంది శంభల్ అంటే నీటి బుగ్గ అని కూడా భావిస్తారు. ఎందుకంటే ఈ పదానికి అర్థం నీటికి దగ్గరగా ఉన్న ప్రాంతం అని కూడా ఉంది కాబట్టి.

చివరి అవతారపురుషుడు జన్మించిన ప్రదేశం నీటికి దగ్గరగా ఉన్న ప్రదేశం అన్నది కూడా ఇక్కడ మనం గమనించాలి. ఆ ప్రదేశం శాంతినిలయగం, ఆకర్షణీయమైన ప్రదేశమై ఉండాలి. అవతారపురుషుని జన్మప్రదేశం పవిత్రమైనది, పరిశుభ్రమైనది. అంటే ఆ ప్రదేశంలో ఎల్లప్పుడు పరిశుభ్రంగా ఉంటుది. అక్కడ హింసాదౌర్జన్యాలు ఉండవు. ఆ ప్రదేశం పవిత్ర యాత్రాస్థలంగా ఉంటుంది.

**శంభల్ అన్న పదానికి అర్థం శాంతిస్థానం.** చివరి అవతారపురుషుని జన్మస్థానం శాంతిస్థానం. హింసాదౌర్జన్యాలు, శత్రుభయం, అసహనం లేని ప్రాంతం.

చివరి అవతారపురుషుడు భారతదేశంలోనే జన్మించాలని ఎక్కడా లేదు. ఆయన కేవలం సంస్కృతం లేదా హింది మాత్రమే మాట్లాడాలని కూడా ఎక్కడా లేదు. భాష, వ్యవహారశైలి అన్నవి జన్మించిన ప్రదేశాన్ని బట్టి ఉంటాయి. ఏ ప్రదేశంలో అవతార పురుషుడు జన్మిస్తాడో ఆ కాలంలో ఆ ప్రదేశంలో ప్రజలు ఏ భాష మాట్లాడుతారో, వారి వ్యవహారశైలి ఎలా ఉంటుందో అవతారపురుషుని భాష వ్యవహారశైలి కూడా అలాగే ఉంటుంది. అవతారపురుషుడు భారతదేశంలో మాత్రమే జన్మించాలని భావించడం అజ్ఞానం. కేవలం భారతదేశం మాత్రమే దేవునికి ఇష్టమైన ప్రదేశమా? మిగిలిన దేశాల పట్ల అక్కడి ప్రజల పట్ల దేవునికి ఇష్టం ఉండదా? మిగిలిన దేశాల్లో నివసిస్తున్న ప్రజలు మనుష్యులు కాదా? కాబట్టి చివరి అవతారపురుషుడు భారతదేశానికి బయట కూడా జన్మించే అవకాశం ఉంది. ఆయన అక్కడి భాషనే మాట్లాడుతారు. అక్కడి వ్యవహారశైలి వస్త్రధారణ కలిగి ఉంటారు.

ఆ కాలంలో అంటే 13 లేదా 14 వందల సంవత్సరాల క్రితం అలాంటి అవతారపురుషుడెవ్వరు భారతదేశంలో జన్మించలేదు.

పురాణాలన్నింటిలోను కల్కి అవతారం జన్మస్థానం శంభల్ అని ఉంది. కాబట్టి ఇప్పుడు శంభల్ అన్న పదానికి ఉన్న అర్థం దృష్ట్యా చివరి అవతారపురుషుని జన్మస్థానం గురించి ఆలోచించవలసి ఉంది.



# ప్రపంచంలో సాంఘీక, ధార్మిక మార్పులు చోటుచేసుకున్న కాలం

ప్రపంచంలో ప్రతి మహాపురుషుడు జన్మించిన కాలాన్ని పరిశీలిస్తే ఆ కాలంలో చాలా కఠినమైన పరిస్థితులు నెలకొని ఉండేవన్నది అర్థం అవుతుంది. మరోవిధంగా చెప్పాలంటే కఠినమైన పరిస్థితులు నెలకొన్నప్పుడే మహాపురుషులు జన్మించారు. రెండువేల సంవత్సరాల క్రితం భారతదేశంలోను పరిస్థితులు చాలా దిగజారి ఉండేవి. ప్రాచీనభారతదేశ చరిత్ర పరిశీలిస్తే ఆ కాలం చీకటి యుగంగా ఉండేదని తెలుస్తుంది. హింసాదౌర్జన్యాలు మితిమీరిపోయాయి. ఇది దాదాపు క్రీ.శ.500 కాలం. వేదకాలంలో విగ్రహారాధన లేదు. కాని ఇప్పుడు మనం చెప్పుకుంటున్న కాలంలో విగ్రహారాధన సర్వసాధారణమైపోయింది. ఆరాధనాలయాల్లో విగ్రహారాధనకు ప్రత్యేకప్రాముఖ్యం లభించింది. పూజారులు మందిరాల్లో వివిధ విగ్రహాలను ప్రతిష్ఠించడం ప్రారంభించారు. మతపెద్దలుగా మారారు. మందిరానికి వచ్చే సాధారణప్రజలను దోచుకోవడం కూడా ప్రారంభమయ్యింది.

వేదకాలంలో హిందువులందరు సమైక్యంగా, సమానంగా ఉండేవారు. కాని ఈ కాలంలో కులవ్యవస్థ కారణంగా నిమ్నోన్నతలు చోటుచేసుకున్నాయి. వేదకాలంలో కులవ్యవస్థ అన్నది ఆచరణల ఆధారంగా ఉండేది కాని ఈ కాలంలో కులవ్యవస్థ పుట్టుకరీత్యా ఏర్పడింది. అందువల్ల సాంఘీక వ్యవస్థ తీవ్రంగా దెబ్బతిన్నది. సామాజిక నియమాలు కట్టుబాట్లలో పక్షపాతాలు అధికమయ్యాయి. బ్రాహ్మణులు ఎంత తీవ్రమైన నేరం చేసినా కఠినశిక్షలు ఉండేవి కావు. కాని నిమ్నకులస్థుడు ఏ చిన్న నేరం చేసినా శిక్షలు తీవ్రంగా ఉండేవి. అగ్రకులస్థుడు ఎవరైనా నిమ్నకులానికి చెందిన వివాహిత మహిళతో అక్రమ సంబంధం పెట్టుకుంటే కేవలం మామూలు శిక్షతో సరిపెట్టేవారు. కాని అదే ఒక నిమ్నకులస్తుడు ఎవరైనా వివాహిత అగ్రకుల మహిళతో అక్రమ సంబంధం పెట్టుకుంటే మరణశిక్ష విధించేవారు. ఎవరైనా నిమ్నకులస్తుడు అగ్రకులస్తునికి ఏదన్నా సలహా ఇవ్వడానికి సాహసిస్తే వేడి వేడి నూనె నోట్లో పోసేవారు. నిమ్నకులస్తుడు అగ్రకులస్తుని దూషిస్తే నాలుక కోసేవారు, నిమ్నకుల మహిళలను ఉంపుడుగత్తెలుగా ఉంచుకునేవారు.

(హిస్టరి సివిలైజేషన్ ఇన్ యానిషెంట్ ఇండియా, ఆర్.సి.దత్, పేజి 281, 243, 308, 331, 342, 343)

మద్యపానం అన్నది రాజులకు గర్వకారణంగా ఉండేది. రాచకుటుంబాల్లోని మహిళలు కూడా బహిరంగంగా మద్యం తాగేవారు. రహదారులపై గుండాలు, దుర్మార్గులు సంచరించేవారు. దేవుడిని అన్వేషించడం, దేవుని ఆరాధించడం అన్నది అడవుల్లో జరిగేది. కల్పిత భావాలను, దయ్యాలను, దుష్టశక్తులను కూడా ఆరాధించేవారు.

రోమన్, పర్షియన్ సామ్రాజ్యాలకు ముందు కాలంలో ఇలాంటి దిగజారిని పరిస్థితులు బహుశా లేవు. ఏడవ శతాబ్దం ఆరంభకాలంలో అలాంటి పరిస్థితులు నెలకొన్నాయి. బైజాంటైన్ సామ్రాజ్య పతనం తర్వాత పూజారుల చెడుప్రవర్తన క్రయిస్తవ మతప్రతిష్ఠను దెబ్బతీసింది. పరిస్థితులు ఎంతగా దిగజారాయంటే వాటిని వర్ణించడం కూడా కష్టం. ఇంత దిగజారిన పరిస్థితులు ఉండేవా అని నేటి ప్రజలు ఆశ్చర్యపోతారు. కాని ఆ కాలంలో పరిస్థితులు అలాగే ఉండేవనడానికి గట్టి ఆధారాలున్నాయి. యుద్ధాల కారణంగా సమాజం చిన్నాభిన్నమైంది. ఘర్షణలు, పోరాటాల కారణంగా నగరాలు, పట్టణాల్లో రక్తం ఏరులై పారేది. ఆ కాలంలో అరేబియా ప్రాంతంలో ప్రవక్త ముహమ్మద్ (స) గారి ధర్మం ప్రచారంలోకి వచ్చింది. ఈ ప్రదేశం రోమన్ సామ్రాజ్య యుద్ధాలకు చాలా దూరంగా ఉన్న ప్రాంతం. ఈ ధర్మం ఒక తూఫానులా పూర్తి ప్రపంచంలో వ్యాపించడానికి వచ్చిన ధర్మం. ఒక సుడిగాలిలా ప్రభుత్వాలను, రాజులను, వారి దృక్పథాలను ఎగరేయడానికి వచ్చిన ధర్మం.

ప్రవక్త ముహమ్మద్ (స) జన్మకు ముందు క్రయిస్తవుల్లో అనేక చెడులు చోటు చేసుకున్నాయన్నది చారిత్రక ఆధారాల వల్ల తెలుస్తున్న సత్యం. (జార్జిసీల్ చేసిన దివ్యఖుర్‌ఆన్ అనువాదం మొదటి ఎడిషన్ ముందుమాట పేజి 25&26). జార్జిసీల్ తాను చేసిన దివ్యఖురాన్ అనువాదం ముందుమాటలో క్రయిస్తవ పూజారులు ధర్మాన్ని ముక్కలు ముక్కలు చేసారని రాశాడు. శాంతి, శ్రేయం, మేలు అన్నవి కానరాకుండా పోయాయి. వారు నిజమైన ధర్మాన్ని మరిచిపోయారు. నిస్సిగ్గుగా విగ్రాహారాధన ప్రారంభ మయ్యింది. ప్రవక్త ముహమ్మద్ (స)కు ముందు క్రయిస్తవం, విగ్రహారాధనల సమ్మేళనం కొత్త రూపం ధరించింది. అందువల్ల క్రయిస్తవుల్లోను విగ్రహారాధన ప్రముఖంగా ఉండేది. ముగ్గురు దేవుళ్ళను ప్రతిష్ఠించుకున్నారు. పవిత్ర మేరీమాతను దేవుని మాతగా ప్రకటించారు. ఏ హిస్టరీ ఆఫ్ సివిలైజేషన్ ఇన్ యానిషెంట్ ఇండియాలో ఆర్.సి.దత్ ఈ వాస్తవాలను వివరించారు. పర్షియన్ సామ్రాజ్యంలో ఆ కాలంలో అత్యంత దిగజారిన పరిస్థితి ఉండేది. బైజాంటైన్ నియంతలు బలహీనపడడం వల్ల పూర్తి ప్రభుత్వ వ్యవస్థ

అస్తవ్యస్తంగా ఉండేది. ముఖ్యంగా పూజారులు మతపెద్దలు ఇష్టారాజ్యంగా వ్యవహరించేవారు. క్రయిస్తవం పరిస్థితి కూడా అలాగే ఉండేది. ఘర్షణలు, రక్తపాతాలు సర్వసామాన్యమయ్యాయి. పూర్తి సామాజిక చట్రం చిన్నాభిన్నమై పోయింది. జనావాసాల్లో రక్తపు నదులు ప్రవహించేవి.

ఆ కాలంలో అరేబియాలోని ఒక మారుమూల ప్రాంతంలో ప్రవక్త ముహమ్మద్ (స) ధర్మప్రచారం ప్రారంభమయ్యింది. ప్రపంచాన్ని ఒక తుఫానులా క్రమ్ముకోవడానికి ఈ ధర్మం వచ్చింది.

# చివరి అవతారపురుషుడని చెప్పే ఆధారాలు

పైన పేర్కొన్న వాస్తవాల వల్ల చివరి అవతారపురుషుడు గుర్రంపై ప్రయాణిస్తారని స్పష్టంగా తెలుస్తోంది. గుర్రాలు, ఖడ్గాల కాలం నేడు గతించింది. ఇది విమానాలు, అణుబాంబులు కాలం. కాబట్టి చివరి అవతారపురుషుడు జన్మించిన కాలం గతించిన కాలమే అని తెలుస్తోంది. అలాగే ధార్మకత పతనమై హింసాదౌర్జన్యాలు ప్రబలమైన కాలంలో అవతారపురుషుడు జన్మిస్తాడని తెలుస్తోంది కాబట్టి చివరి అవతారుపురుషుడు ఎప్పుడు జన్మించి ఉంటాడో కాల నిర్ధారణ కూడా మనకు స్పష్టమైంది.
కల్కి అవతారం ప్రవక్త ముహమ్మద్ (స) ఇద్దరి మధ్య పోలికలు చూస్తే :

**1. గుర్రపు స్వారీ ఖడ్గచాలనం :** భగవతపురాణం ద్వాద్విశసిఖండం, ద్విత్య అధ్యయం 19వ శ్లోకం ప్రకారం కల్కి అవతారం దేవతలు ఇచ్చిన గుర్రంపై స్వారీ చేస్తారని ఉంది. ఆయన దుష్టులను తన ఖడ్గంతో అంతంమొందిస్తారని ఉంది. దేవతలు ప్రసాదించిన ఈ గుర్రం అత్యుత్తమమైనది. ఆ గుర్రంపై స్వారీ చేస్తూ ఆయన దుష్టులను నిర్మూలిస్తారు. ప్రవక్త ముహమ్మద్ (స)కు కూడా దైవికంగా లభించిన గుర్రం ఉంది. ఆ వాహనం పేరు బుర్రాక్. ఆయన ఆ వాహనంపై స్వారీ చేస్తూ గగనారోహణం చేసారు. ఆ వాహనం ప్రవక్త ముహమ్మద్ (స)కు ఇష్టమైన వాహనం. ఆయన వద్ద చాలా గుర్రాలు ఉండేవి. ప్రవక్త సహచరులు హజ్రత్ అనస్ (రజి) ప్రకారం ఆయన ప్రవక్త మెడకు ఖడ్గం వేలాడుతుండగా ప్రవక్త గుర్రంపై స్వారీ చేయడాన్ని ఆయన చూసారు. ప్రవక్త ముహమ్మద్ (స) వద్ద అనేక ఖడ్గాలు ఉండేవి. అందులో ఒకటి ఆయనకు వారసత్వంగా లభించింది. రెండవ ఖడ్గం జుల్ఫికర్, మూడవ ఖడ్గం ఖలాల్ ఈ మూడు ఖడ్గాలు ఆయనకు ఇష్టమైనవి.

**2.జగత్ గురు :** భగవత్ పురాణం ప్రకారం చివరి అవతారపురుషుడు జగత్‌గురుగా ప్రఖ్యాతి పొందుతారు. అంటే ప్రపంచాన్ని పరిరక్షించేవాడు. తన హితబోధల ద్వారా ఆయన పతనమవుతున్న సమాజాన్ని పరిరక్షిస్తాడు. ఇక్కడ సమాజం అంటే ఏదో ఒక పరిమిత సముదాయం కాదు. పూర్తి ప్రపంచమే ఆయన సమాజం. ప్రవక్త ముహమ్మద్ (స) గురించి దివ్యఖుర్‌ఆన్ ఇదే విషయాన్ని చెబుతోంది. పూర్తి ప్రపంచానికి దేవుని సందేశం అందించే ప్రవక్తగా ఆయన్ను ప్రబోధించింది.

(1. ది హిస్టరీ ఆఫ్ స్ట్రగుల్ బిట్వీన్ సైన్స్ అండ్ రెలిజియన్, డ్రాపర్ (సీరతున్నబి నుంచి గ్రహించడం జరిగింది.

2 భగవత్ పురాణం ద్వాదశ్ ద్విత్య అధ్యాయ్ శ్లోకం 19, బుర్రాక్ చిత్రాన్ని ఆర్గనైజర్ పత్రిక 1969, ఫిబ్రవరి 8వ తేదీన ప్రచురించింది.

3. అసాఉస్సియార్, పేజి 565, జమావుల్ ఫవాయిద్ సంపుటం 2, పేజి 179

4. బుఖారి 5. అమ్నుసింయర్, పేజి 498

6. భగవత్ పురాణం ద్వాదశ్ ద్విత్య అధ్యాయ్ శ్లోకం 19

7. సూరా అరాఫ్, ఆయత్ 158)

## బురాఖ్ పటము

మరో చోట దివ్యఖుర్‌ఆన్ ఈ విధంగా చెబుతోంది. దేవుడు అతి పవిత్రుడు. ఆయన ఈ పవిత్ర గ్రంథాన్ని తన ఆరాధకునిపై అవతరింపచేసాడు. ఈ పుస్తకం ద్వారా ఆయన పూర్తి ప్రపంచాన్ని పాపాలు చేయకుండా హెచ్చరించడానికి.

ఈ విధంగా చూస్తే జగత్‌గురు వ్యక్తిత్వం ఆయన ప్రాముఖ్యం మనకు తెలుస్తోంది.

**3. అసాధుదమన్ :** కల్కి గురించిన ప్రస్తావనల్లో ఆయన దుష్టులను అంతం చేస్తాడని ఉంది. ఈ ప్రస్తావన ప్రవక్త ముహమ్మద్ (స)కు పూర్తిగా వర్తిస్తుంది. ఆయన దుష్టులను అణిచివేసారు. దివ్యఖుర్‌ఆన్ ప్రకారం క్రూరత్వానికి గురైన వారికి ప్రతిఘటించే అనుమతి పూర్తిగా ఉంది. దేవుడు వారికి సహాయం చేయగల సమర్థుడు. దేవుడు ఒక్కడే అన్నందుకు దైవారాధకులను వారి ఇళ్ళ నుంచి గెంటేయడం జరిగింది. ప్రవక్త ముహమ్మద్ (స) దుర్మార్గులను, దోపిడీ గాళ్లను సంస్కరించారు. ఏకదైవారాధన గురించి వారికి హితబోధ

చేసారు. బహుదైవారాధనలోని చెడును వివరించారు. విగ్రహారాధనను వ్యతిరేకించారు. ఇస్లాం అన్నది కొత్త మతం కాదని, దేవుని విధేయత చూపడమే ఇస్లామని తెలియజేసారు. వేద్ అన్న పదానికి కూడా దేవుని స్వరం అన్న అర్థం ఉంది. దైవాదేశాలను అమలు చేసే ధర్మం వైదిక ధర్మం. అంటే ఇస్లామ్‌కు వైదికధర్మానికి మధ్య పోలికలున్నాయి. ఈ రెంటినీ అనుసరించని వారిని నాస్తికులు అంటాము లేదా అవిశ్వాసులు అంటాము. ప్రవక్త ముహమ్మద్ (స) జన్మించిన కాలంలో దోపిడీగాళ్ళు, దుర్మార్గులు సమాజంలో అధికమయ్యారు. ఆడపిల్లలను హత్యచేసేవారు. పర్షియాకు మొదటి రాజు ఖబద్. ఆయన మజ్దక్ ప్రసంగం విని చాలా ప్రభావితుడయ్యాడు. ఆ వెంటనే సంపద, ఆస్తులన్నవి ఉమ్మడి సొత్తులని, వ్యక్తిగతంగా ఎవరికీ సొంతం కాదని ప్రకటించాడు. ఈ అతివాదం చివరకు ప్రవక్త ముహమ్మద్ (స) వచ్చిన తర్వాత గాని అంతం కాలేదు. ప్రవక్త ముహమ్మద్ (స) ఇలాంటి కుహనా సిద్ధాంతాలన్నింటిని అంతం చేసి సత్యధర్మం ప్రతిష్ఠించారు.

**4. జన్మస్థానం గురించి వివరణ :** కల్కి జన్మస్థానం శంభల్. ఆయన ఒక పూజారి ఇంట్లో జన్మిస్తారు. ఆ పూజారి పేరు విష్ణుయశ్. ఈ పేర్లన్ని సంస్కృతంలో ఉన్నాయి. ఈ పేర్లు గుణవాచకాలు కావాలి లేదా ఇవి అరబ్బీ నుంచి సంస్కృతంలోకి అనువాదం చేయబడిన పదాలు కావాలి. కాబట్టి ఈ పదాల అర్థాలను తీసుకుని పరిశీలించడం ఉత్తమం. శంభల్ అంటే శాంతినిలయం. మక్కా నగరాన్ని అరబ్బీలో దారుల్ అమన్ అంటారు. అంటే శాంతినిలయం అని అర్థం. ఇస్లాం అంటే దేవునికి విధేయత చూపడం అంటే సంస్కృతంలో సనాతన ధర్మం లేదా ఆస్తికత్వం.

**5. పూజారి ఇంట్లో జననం :** కల్కి అవతారం ఒక పూజారి ఇంట్లో జన్మిస్తారని ఉంది. ప్రవక్త ముహమ్మద్ (స) కూడా ఒక పూజారి ఇంట్లో జన్మించారు. కాబాగృహానికి అప్పట్లో ధర్మకర్తలుగా ఉన్న కుటుంబంలో ఆయన జన్మించారు.

**6. తల్లిదండ్రులకు సంబంధించిన వివరణ :** కల్కి పురాణం ప్రకారం కల్కిఅవతారం తల్లి పేరు సుమతి అంటే మృదుస్వభావం కలిగిన నెమ్మది కలిగిన మహిళ అని అర్థం. తండ్రి పేరు విష్ణుయశ్. అంటే అర్థం స్వచ్ఛమైన దేవుని ఆరాధకుడు. ప్రవక్త ముహమ్మద్ (స) తల్లిగారి పేరు ఆమినా, తండ్రి పేరు అబ్దుల్లా. ఈ పేర్ల అర్థాలు కూడా పైన పేర్కొన్నవే.

**7. చివరిఅవతారపురుషుని అవతరణ :** కల్కి అవతారం చివరి అవతారం. ప్రవక్త ముహమ్మద్ (స) చివరి ప్రవక్తగా పేర్కొనబడ్డారు. అందువల్లనే ముస్లిములు ప్రవక్త ముహమ్మద్ (స) తర్వాత మరే ప్రవక్తను విశ్వసించడం జరగదు. కల్కి అన్న పదానికి నిఘంటువు అర్థం ఏమంటే సీతాఫలాన్ని తిని మరకలను కడిగేవాడని. ప్రవక్త ముహమ్మద్ (స) కూడా ఖర్జూరాలు తినేవారు. ఆయన దైవతిరస్కారం వంటి మరకలను కడిగేసారు.

**8. ఉత్తరం నుంచి రావడం మరియు ప్రసంగం :** కల్కి పురాణం ప్రకారం కల్కి జన్మానంతరం ఒక కొండదిశగా వెళతారు. అక్కడ పరశురాముని ద్వారా విద్యాజ్ఞానం పొందుతారు. (పరశురామ్ ఒక గుహలో కల్కి అవతారానికి జ్ఞానబోధ చేస్తారు. ఇక్కడ పరశురామ్ = దైవదూత జిబ్రయీల్, కొండగుహ = హీరాగుహ (సర్వరె ఆలమ్ పేజి 21, కల్కి అవతారం తన దేశంలో ఉత్తరదిశగా ప్రయాణం చేస్తారు. తర్వాత కొంత కాలానికి విజేతగా తిరిగి వస్తారు ఇది మక్కా నగరం నుంచి వలస మదీన నగరానికి తరలిపోవడం తిరిగి రావడాన్ని సూచిస్తుంది)

ఆ తర్వాత ఉత్తరానికి వెళ్ళి తిరిగి వస్తారు. ప్రవక్త ముహమ్మద్ (స) కూడా ఒక కొండదిశగా వెళ్ళారు. దైవదూత జిబ్రయీల్ (అస) ద్వారా జ్ఞానాన్ని పొందుతారు. ఆ తర్వాత దివ్యఖుర్‌ఆన్ అవతరణ ప్రారంభమయ్యింది. ఆ తర్వాత ఆయన ఉత్తరం దిశగా మదినా నగరానికి వెళ్ళారు. ఆ పిదప అయన దక్షిణానికి మళ్ళీ వచ్చి తన జన్మప్రదేశాన్ని సందర్శించారు. పురాణాల్లోను ఈ సంఘటనలు ఇలాగే వర్ణించబడ్డాయి.

**9. శివుని ద్వారా గుర్రం బహూకరణ :** కల్కి పురుషునికి శివుడు ఒక గుర్రాన్ని బహూకరిస్తాడు. ఆ గుర్రం మహిమాన్వితమైనది. ప్రవక్త ముహమ్మద్ (స)కు దేవుడు ఒక వాహనాన్ని బహూకరించాడు. ఆ వాహనం పేరు బుర్రాక్. అది మహమాన్వితమైనది.

**10. కలిని నలుగురు సోదరులతో ఓడించడం :** కల్కి పురాణం ప్రకారం కల్కి తన నలుగురు సోదరులతో కలిసి కలి సాతాన్ను ఓడిస్తాడు. ప్రవక్త ముహమ్మద్ (స) తన నలుగురు సహచరులతో అంటే హజ్రత్ అబూబక్ర్ (రజి), హజ్రత్ ఉమర్ (రజి), హజ్రత్ ఉస్మాన్ (రజి), హజ్రత్ అలీ (రజి) లతో కలిసి దుష్టశక్తులను ఓడించారు. ఏకదైవారాధక ధర్మాన్ని ప్రబోధించారు.

**11. దైవసహాయం :** కల్కి అవతారానికి దేవతలు యుద్ధాల్లో సహాయపడతారని కల్కి పురాణం చెబుతోంది. బద్ర్ యుద్ధంలో ప్రవక్త ముహమ్మద్ (స)కు సహాయపడడానికి దైవదూతలు ఆకాశం నుంచి దిగివచ్చారు. దివ్యఖుర్‌ఆన్ ఈ విషయాన్ని తెలియజేసింది.

మీరు సంఖ్యలో స్వల్పంగా ఉన్నప్పుడు దైవదూతలను పంపి బద్ర్‌యుద్ధంలో మీకు దైవం సహాయం చేసాడు. కాబట్టి దేవునికి భయపడండి. ఆయన పట్ల కృతజ్ఞతలు చూపండి. మీకు సహాయం చేయడానికి మూడువేల మంది దేవదూతలను పంపిన అల్లాహ్ సహాయం మీకు చాలదా? కాని మీరు సహనం వహించాలి. దేవునికి భయపడాలి. అలాగే మీరు దేవుని సహాయం కోసం అర్థించినపుడు ఆయన మీకు 5000 మంది దైవదూతలను పంపి సహాయపడ్డాడు. మీకు వ్యతిరేకంగా సైన్యాలు వచ్చినప్పుడు విశ్వాసులు దేవుని అనుగ్రహాలను గుర్తుకు తెచ్చుకుంటారు. తుఫానులు తదితర సైన్యాలను మీకు కానరాని సైన్యాలను కూడా ఆయన పంపగలడు. మీరు చేస్తున్నదంతా ఆయన గమనిస్తున్నాడు.

(పరశురాముడు కల్కి అవతారానికి ఒక గుహలో జ్ఞానబోధ చేస్తాడని ఉంది. పరశురాముడు = జిబ్రయీల్ లేదా పవిత్ర దూత, గుహ = హీరా గుహ (సర్వరె ఆలమ్ పేజి నెం.21, కల్కి అవతారం తన స్వదేశంలో ఉత్తరదిశగా ప్రయాణిస్తాడు, తర్వాత కొంతకాలానికి తన నగరానికి తిరిగి వస్తాడు. పూర్తి దేశాన్ని జయిస్తాడు. ప్రవక్త (స) మదీనా నగరానికి తరలిపోవడం తర్వాత మక్కా విజయాన్ని ఇది సూచిస్తోంది. (సర్వరె ఆలమ్ పేజి 23)

**12. సంపూర్ణ ప్రకాశం :** కల్కి అవతారం గురించి ఏమున్నదంటే ఆయన సంపూర్ణమైన కాంతి కలిగి ఉంటాడు. ఆయన చాలా అందంగా ఉంటారు. ప్రవక్త ముహమ్మద్ (స) కూడా మానవాళిలో అత్యంత అందమైన వ్యక్తి, అందరికన్నాన ఆదర్శనీయుడు, అన్నింటికి మించి గొప్ప యోధుడు.

**13. జన్మదినం :** కల్కి జన్మదినం గురించి కల్కి పురాణంలో ఏమున్నదంటే ఆయన మాఘమాసం శుక్లపక్ష ద్వాదశి నాడు జన్మిస్తారని ఉంది. ప్రవక్త ముహమ్మద్ (స) రబీవుల్ అవ్వల్ 12వ తేదీన జన్మించారు. అంటే శుక్లపక్ష ద్వాదశి రోజునే.

**14. శరీరసువాసన :** శ్రీ మద్ భగవత్ పురాణం ప్రకారం కల్కి శరీర సువాసన హృదయాలను పరిశుద్ధపరుస్తుంది.

ప్రవక్త ముహమ్మద& (స) గారి శరీర సువాసన ప్రఖ్యాతి గాంచింది. ఆయనతో ఎవరైనా కరచలనం చేస్తే ఆరోజంతా ఆ వ్యక్తి చేతికి సువాసన ఉండేది. ప్రవక్త ముహమ్మద్ (స) గారి నౌకరు మాటల ప్రకారం ఆయన వెళ్ళిన ప్రతి ప్రదేశంలోనూ ఆయన శరీర గంధం వ్యాపించేది.

ఒకసారి ఉమ్మె సులైమాన్ ప్రవక్త ముహమ్మధ్ (స) గారి చెమటను సేకరించారు.

అప్పుడు ప్రవక్త (స) ఆమెతో "దాంతో ఏంచేస్తారని" అడిగితే ఆమె దానిని సువాసన ద్రవ్యాల్లో కలుపుతానని, ఎందుకంటే అన్ని సువాసనల కాన్న ఇది మేలైనదని చెప్పారు.

(1. ఖుర్ఆన్, సూరా అహ్జాబ్ ఆయత్ 9,
2. భగవత్ పురాణం అధ్యయం 12 పేరా 32, శ్లోకం 20
3. జమావుల్ ఫవాయిద్ పేనజి 279 బుఖారి గ్రంథం.
4. కల్కి పురాణం పేరా 2, శ్లోకం 4 5. అషావుస్సియాద్ పేజి 48
6. భగవత్ పురాణం, అధ్యయం 12, పేరా 32, శ్లోకం 21 7. షిమాయిలె తిర్మిజి
8. అనస్(రజి) గారి నౌకరు వ్యాఖ్య "మేము ఎల్లప్పుడు ముహమ్మద్ (స) గారి రాకను వారి శరీరం నుంచి వచ్చే ఫిర్దౌస్ సువాసనను బట్టి గుర్తించేవారము', విలియం మూర్ రాసిన ప్రవక్త (స) జీవితం చరిత్ర నుంచి)

**15. ఎనిమిది దైవిక లక్షణాలు :** 1. భగవత్ పురాణం అధ్యం 12 ప్రకారం కల్కి అవతారం ఎనిమిది దైవిక లక్షణాలు కలిగి ఉంటుంది. అవేమంటే అగోచర జ్ఞానం, ఉన్నత వంశం, ఆత్మనిగ్రహం, దైవవాణి శారీరక బలం, తక్కువగా మాట్లాడడం, పరోపకారం, కృతజ్ఞత.

**ఎ. అగోచరజ్ఞానం :** ప్రవక్త ముహమ్మద్ (స)కు భూత భవిష్యత్ వర్తమాన కాలాలకు సంబంధించిన జ్ఞానం ఉండేది. ఈ వాస్తవం అనేక సందర్భాల్లో రుజువైంది. ఆయా సంఘటనల గురించి ముహమ్మద్ ఇనాయత్ అహ్మద్ గారు తన పుస్తకం "అల్ ఖలాబల్బాన్"లో వివరించారు. ఉదాహరణకు రోమన్లు పర్షియన్ల మధ్య యుద్ధం జరుగుతున్నప్పుడు రోమన్లు పరాజయం పాలయ్యారు. అప్పుడు ప్రవక్త (స) దైవికంగా ఈ విషయాన్ని తెలుసుకుని వెంటనే తన సహచరులకు తెలిపారు. అయితే ఖురైషులు ఈ సంఘటన గురించి ప్రవక్త (స) సహచరుల ద్వారా తెలుసుకుని రోమన్లు ఓడి పోయారని మహాసంబరపడిపోయారు. కాని తొమ్మిదేళ్ళ తర్వాత పర్షియన్లు ఓడిపోతారని ప్రవక్త (స) (భవిష్యవాణి తెలిపారు. ఆయన అన్నట్లే క్రీ.శ. 627లో జరిగిన యుద్ధంలో రోమన్లు గెలిచారు. ఈ సందర్భంగానే సూరా రోమ్ అవతరించింది. అలాగే ప్రవక్త (స) దైవికజ్ఞానం ద్వారా చెప్పిన అనేక సంఘటనలు చరిత్రలో నమోదయ్యాయి.

**బి. ఉన్నత వంశం :** కల్కి అవతారం ఉన్నత బ్రాహ్మణ వంశంలో జన్మిస్తుందని ఉంది. ప్రవక్త (స) కూడా ఉన్నత పూజారి కుటుంబంలో జన్మించారు. ఆయన వంశం కాబాగృహం ధర్మకర్తల వంశం. ప్రవక్త (స) క్రీ.శ.571లో జన్మించారు. ఖురైషుల్లోని హాషిం వంశంలో పుట్టారు. ఈ వంశానికి అరబ్బుల్లో గొప్ప గౌరవ ప్రతిష్ఠలు ఉండేవి.

(1. మహాభారతం 2. ఆయన క్రీ.శ.571లో జన్మించారు. ఉన్నత పూజారి కుటుంబంలో జన్మించారు. ఆ వంశం సుదీర్ఘకాలంగా కాబా గృహానికి ధర్మకర్తలుగా ఉన్న వంశం, ఇంట్రొడక్షన్ సెర్మన్స్ ఆఫ్ ముహమ్మద్ (స), లేన్ పూల్ పబ్లిషర్స్ మెక్‌మిల్లన్, లండన్. 3. ఆయన హాషిం కుటుంబంలో జన్మించారు. అరబ్బులో ఆ కుటుంబానికి అత్యంత గౌరవాదరాలు ఉండేవి. ఆ కుటుంబం మక్కా నగరానికి కులీన కుటుంబం వంటిది. వారసత్వంగా కాబాగృహం పూజారులుగా ఉంటున్న కుటుంబం. డిక్లయిన్ అండ్ ఫాల్ ఆఫ్ రోమన్ ఎంపైర్, ఎడ్వర్డ్ గిబ్బన్, పేజి 229, వాల్యూం 5)

**సి. ఆత్మనిగ్రహం :** ఎనిమిది లక్షణాల్లో మూడవ లక్షణం ఆత్మనిగ్రహం. కల్కి అవతారం గురించి ధార్మిక పుస్తకాల్లో ఏమున్నదంటే, ఆయన అత్యం ఆత్మనిగ్రహం కలిగిన వారని ఉంది. ప్రవక్త ముహమ్మద్ (స) కూడా అత్యంత ఆత్మనిగ్రహం కలిగిన వ్యక్తి. మనోకాంక్షలపై అదుపు కలిగిన వారు. దయాహృదయుడు, శాంతిప్రేమికుడు. ఆత్మనిగ్రహం అంటే తన కోరికలను అదుపులో ఉంచుకోవడం. కోరికలన్నవి హృదయంలో జనిస్తాయి. మనస్సులో జనిస్తాయి. మనస్సును అదుపులో ఉంచుకుంటే, కోరికలు అదుపులో ఉంటాం. అయితే ప్రవక్త (స) బహు వివాహాలు చేసుకున్న కారణాన్ని చూపి చాలా మంది ఆయన ఆత్మనిగ్రహం పై విమర్శలు చేస్తూ ఉంటారు. అలాంటి వారు తెలుసుకోవలసింది ఏమంటే యోగిరాజ్ శ్రీకృష్ణునికి 600 కన్నా ఎక్కువగా రాణులు ఉండేవారు. యోగి అంటే కోరికలకు అతీతంగా ఉండేవారు. ప్రాపంచిక వ్యవహారాలు, అనుభవాలలో వారు ఉంటున్నప్పటికీ అవేవీ వారి హృదయాలను తాకవు. నీటిలో ఉన్నప్పటికీ కమలం నీటికి దూరంగానే ఉంటుంది. నీరు దానికి అంటదు. అదేవిధంగా ప్రాపంచి వ్యవహారాల్లో ఉన్నప్పటికీ యోగి ఆ వ్యవహారాలకు మానసికంగా దూరంగానే ఉంటారు. అందువల్ల ప్రవక్త ముహమ్మద్ (స) వివాహాలను ప్రాపంచిక సంప్రదాయాలకు అనుగుణంగా చూడాలి. కోరికలకు అతీతమైన ఆయన ఆత్మనిగ్రహానికి దీనికి సంబంధం లేదు.

**డి. దైవవాణి :** ఇది ఎనిమిది లక్షణాల్లో నాలుగవ లక్షణం. దైవవాణి అంటే దేవుని హితబోధ ఒక సందేశహరుని ద్వారా అందడం. ప్రవక్త ముహమ్మద్ (స0 గారికి దైవవాణి అవతరించేది. సర్ విలియం మూర్ కూడా ఈ విషయాన్ని రాస్తూ, ప్రవక్త (స) దేవునికి ప్రతినిధిగా అభివర్ణించారు. దీన్ని బట్టి ప్రవక్త ముహమ్మద్ (స), కల్కి అవతారం రెండు ఒక్కటే అని తెలుస్తోంది. (లైఫ్ ఆఫ్ ముహమ్మద్, సర్ విలియం మూర్)

**ఇ. భౌతిక శక్తి :** ఎనిమిది లక్షణాల్లో ఇది ఐదవ లక్షణం. ప్రవక్త ముహమ్మద్ (స)కు

అందరికన్నా ఎక్కువగా శారీరక బలం ఉండేది. రుక్కానా అనే ఒక పహిల్వాను ఒక గుహలో ఉండేవాడు. అతను ఖురైష్ వంశానికి చెందిన వాడు. ప్రవక్త (స) అతడితో దైవాన్ని ఎందుకు విశ్వసించడం లేదు? ఎందుకు దేవునికి భయపడడం లేదు? అని ప్రశ్నించారు. ఆ పహిల్వాను ఏవేవో వివరణలు అడిగాడు. ప్రవక్త (స) అతడితో నువ్వు చాలా బలవంతుడివి, నేను కనుక నిన్ను కుస్తీలో ఓడిస్తే నువ్వు దేవుని విశ్వసించడం ప్రారంభిస్తావా? అని ప్రశ్నించారు. అతను అంగీకరించాడు. ప్రవక్త (స) అతడిని సునాయాసంగా కుస్తీలో ఓడించారు. ఒకసారి కాదు రెండుసార్లు. కాని ఆ పహిల్వాను మాత్రం ఆయన్ను ప్రవక్తగా అంగీకరించడానికి, దేవుని విశ్వసించడానికి సిద్ధం కాలేదు.

**ఎఫ్ : తక్కువగా మాట్లాడడం. :** గొప్పవారి గొప్ప లక్షణాల్లో తక్కువగా మాట్లాడడం కూడా ఒకటి. ప్రవక్త ముహమ్మద్ (స) చాలా తక్కువగా మాట్లాడేవారు. కేవలం చర్చలు, సంవాదాల్లో మాత్రం మాట్లాడేవారు. అరేబియా ప్రజలు ఆయన మాట్లాడుతుంటే మంత్రముగ్ధులై వినేవారు.

**జి. : పరోపకారం :** మతంలో పరోపకారం అన్నది అతి ముఖ్యమైనది. ఎనిమిది లక్షణాల్లో ఏడవ లక్షణం పరోపకారానికి సంబంధించినది. పురాణాల్లో ఈ ఎనిమిది లక్షణాల వివరాలు ఉన్నాయి. ప్రవక్త ముహమ్మద్ (స) ఎల్లప్పుడు దానధర్మాలు చేస్తుండేవారు. ఆయన ఇంటి ముందు బీదవారి గుంపు ఎల్లప్పుడు ఉండేది. ఆయన ఎవరిని నిరుత్సాహపరిచేవారు కాదు. సర్ విలియం మూర్ ప్రకారం ఆయన చాలా అందమైన వ్యక్తి, ఆరోగ్యం, శారీరక ధారుఢ్యంతో పాటు పరోపకార గుణం కలిగిన వ్యక్తి

(1. అసాహుస్సియార్ పేజి 79, లైఫ్ ఆఫ్ ముహమ్మద్, పేజి 523

2. ఆయన చాలా క్లుప్తంగా, సమగ్రంగా మాట్లాడేవారు. ఆయన మాట్లాడిన మాటలు దృఢంగా, స్పష్టంగా ఉండేవి. ఆ మాటలను ఎవ్వరూ మరిచిపోలేని విధంగా ఉండేవి. ఇంట్రొడక్షన్ ఆఫ్ ది స్పీచెస్ ఆఫ్ ముహమ్మద్, లేన్ పూల్

3. సహచరులతో కూర్చున్నప్పుడు ఆయన మౌనంగానే ఉండేవారు. అయితే ఏదైన్నా విషయమై మాట్లాడవలసి ఉన్నప్పుడు చాలా స్పష్టంగా, వాగ్ధాటితో చెప్పేవారు. భాషాపరంగా పటిష్టమైన శైలిలో సామెతలు, పలుకుబళ్ళు ఉపయోగిస్తు అందరిని ఆకట్టుకునేలా మాట్లాడేవారు. ముహమ్మద్ సాహెబ్ అండ్ ముహమ్మడనిజం, బోస్‌వర్త్, పేజి 110

4. నిజానికి ప్రవక్త (స) ఇంటి ముందు ఒక అరుగు ఉండేది. అక్కడ ఎల్లప్పుడు బీదవారు ఉండేవారు. ఆయన చేసే దానధర్మాల వల్ల జీవించేవారు. వారిని అందుకే అరుగువాళ్ళు అని కూడా జనం పిలిచేవారు. లైఫ్ ఆఫ్ ముహమ్మద్, విలియం మూర్, పేజి 523.)

**హెచ్ : కృతజ్ఞతాభావం :** ఇది ఎనిమిదవ లక్షణం. పురాణాల్లో పేర్కొనబడిన ఎనిమిది లక్షణాల్లో ఇది చివరి లక్షణం. ఇంతకు మందు మనం ఏడు లక్షణాల గురించి వివరణ ఇచ్చాము. ప్రవక్త ముహమ్మద్ (స)లో కృతజ్ఞతా భావం ఏ స్థాయిలో ఉండేదో ఏ చరిత్రకారుడు కూడా కాదనలేడు. అన్సార్ల గురించి ఆయన చెప్పిన మాటలే అందుకు నిదర్శనాలు.

**16. దైవవాణి ఆధారంగా హితబోధ :** కల్కి అవతారం స్థాపించే మతం వైదిక మతం అన్నది అందరికి తెలిసిన వాస్తవం. అలాగే ప్రవక్త ముహమ్మద్ (స) ద్వారా అవతరించిన దివ్య ఖురాన్ దేవుని వాణి. ఎవరు అంగీకరించినా అంగీకరించకపోయినా ఇది వాస్తవం. అందువల్ల ఈ మతస్థాపన, లక్షణాలు, ప్రేమ, గౌరవాదరాలు అన్నీ దైవప్రేరితాలే. ఇవే బోధనలు మనకు వేదాల్లోను కనబడతాయి. ఖుర్ఆన్‌లో విగ్రహారాధనను తీవ్రంగా విమర్శించడం జరిగింది. ఖురాన్ బోధనల ప్రకారం ముస్లిములు రోజుకు ఐదు పూటలు నమాజులు చేస్తారు. బ్రాహ్మణుల్లోను పూజారులు రోజుకు మూడుసార్లు సంధ్యావందనం చేస్తారు. ఇప్పుడు మనం ఖురాన్, వేదాల్లో మౌలిక బోధనల్లో సారూప్యాలను చూద్దాం.

# దివ్యఖుర్ఆన్ - వేదాల బోధనలు

1. దేవుడు తప్ప ఆరాధనకు అర్హుడు ఎవ్వరూ లేరు. ఆయన శాశ్వతుడు, స్వయంభువు. అన్నీ ఆయనపై ఆధారపడి ఉన్నవే. ఆయన ఆదేశం లేనిదే ఆయన వ్యవస్థలో ఎవ్వరూ జోక్యం చేసుకోలేరు. మన గతం, భవిష్యత్తుల గురించి అన్నీఆయనకు తెలుసు. ఆయన జ్ఞానంలో ఆయన తలిచినంత మాత్రమే మనం పొందుతాము. అందరినీ ఆయన నిర్వహిస్తున్నాడు. ఆయన ఎన్నడూ అలసిపోడు. ఆయన అన్నింటినీ మించినవాడు. అందరికన్నా గొప్పవాడు.

2. ఉపనిషత్తుల్లోని ఒక శ్లోకం ప్రకారం దేవుడు ఒక్కడే. ఆయన తప్ప వేరెవ్వరూ లేరు. ఇక్కడ ఆయన లేనిదే ఏదీ లేదు. ప్రాపంచి అధికారాలు దేవుడు తలచినంత కాలం మాత్రమే. దేవుని శక్తిని విశ్వసించకపోతే ప్రపంచం ఉనికిలో ఉండలేదు.

(1. అసాహుస్సియార్ పేజి 343 2. దివ్యఖురాన్ 2:255)

3. ఆయన్ను ఎవరు కళ్ళతో చూడలేరు. ఆయన మహత్కార్యాలను మాత్రమే చూడగలరు. ఆయన్ను బ్రహ్మగా విశ్వసిస్తారు. దివ్యఖుర్ఆన్ ప్రకారం కళ్ళు ఏవీ ఆయన్ను చూడలేవు. కాని ఆయన మాత్రం అందరినీ చూడగలడు.

4. మమ్మల్ని సన్మార్గాన నడిపించు. రుగ్వేదం ప్రకారం "ఓ దైవమా! మమ్మల్ని అందమైన దారిన నడిపించు"

5. ఈశ్వరుడు ఒక్కడే. మిగిలినదంతా ఆయనపై ఆధారపడి ఉంది. ఆయన ఎన్నడూ జన్మించలేదు. ఆయన ఎవరికీ జన్మనివ్వలేదు. ఆయనకు ఎవరూ సమానం కాదు. దేవుడు ఒక్కడే. ఎవరికి కానరాని వాడు. అన్ని పనులు చేయగలిగిన సామర్థ్యం కలిగిన వాడు. అన్ని చూస్తున్న వాడు. అన్నీ తెలిసినవాడు. ఆయనకు ఒక ఆకారం అంటూ లేదు. ఆయన అన్నీ చేయగల సమర్థుడు. అందరినీ మించినవాడు. అన్నీ తెలిసినవాడు.

6. ఈశ్వరుడంటే సత్యం. అంటే అల్లాహ్ అంటే సత్యం. వేదాంతం ప్రకారం సత్యమే భ్రహ్మం. బ్రహ్మమే సత్యం

7. మీరెటు తిరిగినా దేవుని వైపునకే ఉంటారు. భగవద్గీత ప్రకారం విశ్వతి ముఖం అంటే అన్ని వైపులా ముఖాలు కలిగిన వాడు.

8.వేదాల్లోను, స్మృతుల్లోను, భగవద్గీతలోను ఒకే దేవుని ఆరాధించాలన్న ఆదేశాలున్నాయి. పాపా పరిహారం కోసం ఆ ఒకేఒక్క దేవుని ఆరాధించాలని ఉంది. దివ్యఖుర్ఆన్ కూడా ఇదే విషయాన్ని చెబుతోంది.

(1. కెన్ ఉపనిషద్, తలబ్కర బ్రాహ్మణం, సామవేదం, అధ్యాయం 1, మంత్రం 3.
2. దివ్యఖుర్ఆన్ 6-102 నుంచి 104
3. దివ్యఖురాన్ సూరా 1
4. దివ్యఖురాన్ 112, 1-4
5.శ్వేత సూత్ర ఉపనిషద్, అధ్యాయం 6, మంత్రం 21
6. దివ్యఖురాన్ 21,32
7. రుగ్వేదం 2090, 9, సామవేదం 627, అథరణ వేదం 29,6,2)

వేదాలను అంగీకరించకపోవడం, దేవుని ఆదేశాలను ఒప్పుకోకపోవడం నాస్తికత్వం అవుతుంది. నాస్తికత్వం అంటే తిరస్కరించడం, విశ్వసించకపోవడం. దివ్యఖురాన్‌లో కాఫిర్ అన్న పదాన్ని ఉపయోగించడం జరిగింది. కాఫిర్ అన్న పదం కూడా ఇదే భావంతో వాడడం జరిగింది. కుఫ్ర్ అంటే తిరస్కరించడం లేదా మరిచిపోవడం తిరస్కారులు ప్రవక్త చెప్పే మాటలను బోధలను తిరస్కరించేవారు.

9. ముసల్మాన్ అన్న పదానికి అర్థం దేవునికి విధేయుడని, దైవవాణిని, ధర్మపురుషుల మాటలను వినేవారు. ధర్మపురుషులు ఏదన్నా చెబుతున్నప్పుడు, వారి మాటలను తిరస్కరించడం పాపమే అవుతుంది. అలాగే ప్రవక్తల బోధనలను పెడచెవిన పెట్టడం పాపం. కాఫిర్ అన్న పదానికి వ్యతిరేకపదం ముసల్మాన్ అన్న పదం. నాస్తికుడన్న పదానికి వ్యతిరేక పదం ఆస్తికుడు. ముస్లిం వ్యక్తి ఒక కాఫిర్‌తో సంబంధాలు పెట్టుకోవడానికి ఇష్టపడడు, అదేవిధంగా ఒక ఆస్తికుడు ఒక నాస్తికునితో సంబంధాలు పెట్టుకోవడానికి ఇష్టపడడు. భారతదేశంలో 75% ప్రజలు ఆస్తికులు, 25% ప్రజలు నాస్తికులు. విద్యావంతుల్లోనే ఎక్కువ నాస్తికులున్నారు. నాస్తిక్, కాఫిర్ పదాలు పర్యాయపదాలు. అదేవిధంగా ముస్లిం, ఆస్తికుడన్న పదాలు పర్యాయపదాలు.

10. ఇక హిందూ అన్న పదం విషయానికి వస్తే, ఇది నిజానికి కొత్త పదం. ప్రాచీన భారతీయ ధర్మాన్ని ఆర్యధర్మమనేవారు. లేదా సనాతన ధర్మమనేవారు. ఆర్యధర్మమంటే ఉత్తమ ధర్మమని అర్థం. సనాతన ధర్మమంటే ప్రాచీన కాలం నుంచి వస్తున్న ధర్మమని అర్థం. సంస్కృతంలోని సకార్ అన్న పదం పార్శీ భాషలో హకార్ అయ్యింది. పార్శీ భాష సింధూనది తీరం వరకు వచ్చింది. సింధూ పదంలోని స అక్షరాన్ని హ అక్షరంగా మార్చింది. అందువల్ల సింధూ అన్న పదం హిందూ అన్న పదంగా మారింది. తర్వాతి పదం స్థాన్ అన్నది స్తాన్‌గా మారింది. ఆ విధంగా హిందూస్తాన్ అన్న పదం ఏర్పడింది. హిందూస్తాన్‌లో ఉన్న ప్రజలను హిందువులు అని పిలిచేవారు. ఈ పదాలు ఇంగ్లీసులోకి కూడా వచ్చాయి. హిందూ అన్న పదంలోని హకారాన్ని తొలగించి ఈ పదం చివర ఐఏ అన్న అక్షరాలను చేర్చి ఇంగ్లీషువారు ఇండియా అని పిలువడం ప్రారంభించారు. ఇక్కడి ప్రజలను ఇండియన్లనడం ప్రారంభమయ్యింది. అందువల్ల భారతీయుడు, ఇండియన్, హిందూ అన్న పదాలు పర్యాయపదాలు. ఈ విషయాన్ని ఎవరైనా ఒప్పుకోకపోతే అది వారి అజ్ఞానమే అవుతుంది. భారతదేశంలోని ముస్లిములు, క్రయిస్తవులు, ద్రావిడులు, కౌల్,కిరాత్, భిల్, పార్శీ, సింథాల్ అందరూ హిందువులే. భాషాశాస్త్రపరమైన జ్ఞానం ఉంటే ఈ విషయం రుజువవుతుంది. హిందూధర్మం, సనాతన ధర్మం, భారతీయ ధర్మం, ఆర్యధర్మం అనేవి భాషాపరమైన భేదాలు తప్ప మరేమీ కాదు.

# సమీక్ష

నేనొక్కడినే కాదు, సర్వమానవ సమైక్యత కోరుకునే విద్యావంతులందరూ, నిష్పక్షపాతంగా ఆలోచించేవారందరూ ఈ పరిశోధనా పత్రాన్ని తప్పకుండా అంగీకరిస్తారు. ఈ దేశంలో ప్రజాజీవితాన్ని శాంతిమయంగా చేయాలని అభిలషిస్తారు. భారతీయులు భగవంతునిగా విశ్వసించే కల్కి అవతారం, ముస్లిములు అనుసరించే ప్రవక్త ఇద్దరూ ఒక్కటే. కల్కి అవతారం భారతీయులకు ఎంతో ప్రయోజనం చేకూరుస్తాడని ఉంది. ఈ స్ఫూర్తితో ప్రతి ఒక్క భారతీయుడు తన్ను తాను హిందువుగా, ఇండియన్‌గా భావిస్తూ కల్కిని విశ్వసించాలి. ఎందుకంటే కల్కి చివరి అవతారం. ఆయన గుర్రంపై ప్రయాణిస్తాడు. చేత ఖడ్గం ధరిస్తాడు. భారతీయ ముస్లిములు పరాయివారని భావించవద్దు. ఎందుకంటే వారు భారతదేశానికి అత్యంత శ్రేయోభిలాష కలిగినవారు. ఇస్లామ్, ముస్లిం అన్న పదాలు అరబీ పదాలు. ఈ పదాలకు అర్థం దేవునికి విధేయత, దైవాదేశాలను శిరసావహించడం, సనాతన ధర్మం లేదా ఆస్తికత్వం కూడా ఇదే.

మతాన్ని గుడ్డిగా అనుసరించేవారు సనాతన ధర్మాన్ని పరిమితం చేస్తున్నారు. ఇతర మతాలను అర్థం చేసుకోకుండా వాటిని వ్యతిరేకిస్తున్నారు. అలాంటి వారు దేవుని సామ్రాజ్యంలో శిక్షలు పొందుతారు. నేనీ పరిశోదనా పత్రాన్ని ఎలాంటి పక్షపాతం లేకుండా రాసాను. అన్ని తెలిసిన వాడయిన ఆ దైవం ఆదేశాలతోనే నేనీ పరిశోధనా పత్రాన్ని రాయగలిగాను. హిందువులకు, ముస్లిములకు మధ్య అప్పుడప్పుడు తలెత్తే కలహాలు, ఘర్షణలు అమాయకుల హత్యాకాండలు మతం పేర సాగుతున్నాయి. దేవుడు వీటిని ఎంత మాత్రం ఇష్టపడడు. శిక్షించడం అన్నది న్యాయం చేయవలసిన పని. ఈ శిక్షలను విధించడం అన్నది సలహాలు ఇచ్చే వారి బాధ్యత కాదు. అది దేవుని బాధ్యత మాత్రమే. ఒక మనిషి మరో మనిషిని ఏ విషయమై కూడా బలవంత పెట్టలేడు. ప్రవక్త క్రీస్తు రాబోయే ప్రవక్త అహ్మద్ గురించి భవిష్యవాణి వినిపించారు. వేదవ్యాసుడు రాబోయే కల్కి అవతారం గురించి చెప్పారు. నేను వారికి సాక్ష్యం చెబుతున్నాను. క్రయిస్తవులు ఆయన్ను విశ్వసించగలరు.

కల్కి అవతారం, ప్రవక్త ముహమ్మద్ (స)ల మధ్య సారూప్యాలకు సంబంధించి నా వద్ద ఎంతో సమాచారం ఉంది. అదంతా చదివిన తర్వాత నేను ఆశ్చర్యపోయాను. ఏ కల్కి అవతారం గురించి భారతీయులు ఎదురు చూస్తున్నారో ఆ కల్కి అవతారం ప్రవక్త ముహమ్మద్ (స) అని తెలుసుకున్నాను. ఎవరికన్నా ఈ విషయంలో అనుమానం

ఉంటే ఆ అనుమానం అజ్ఞానం వల్ల మాత్రమే. మౌలికంగా అన్ని మతాల సూత్రాలు ఒక్కటే. కాని సంకుచిత మనస్కులు ఈ విషయాన్ని గుర్తించరు.

వైదికధర్మంలో చోటుచేసుకున్న కొన్ని రుగ్మతలను తొలగించడానికి గౌతమబుద్ధుడు కొత్త మతాన్ని స్థాపించాడు. కాని పురాణాల్లోని 24 అవతారాల గురించి వివరంగా చదివితే, గౌతమ బుద్ధుడు 23వ అవతారం అని తెలుస్తుంది. అప్పుడు ప్రజలు గౌతమబుద్ధుని మతం తమ స్వంత మతమే అని గ్రహించారు. గౌతమబుద్ధుడు ఒక అవతారం అని తెలుసుకున్నారు. నేడు గౌతమ బుద్ధుని అనుసరించేవారు కూడా వైదికధర్మానుయాయుల్లో భాగమయ్యారు. అదేవిధంగా ప్రవక్త ముహమ్మద్ (స) ప్రచారం చేసిన ధర్మాన్ని అధ్యయనం చేస్తే, ఆ బోధనలు వైదికధర్మానికి వ్యతిరేకంగా ఉన్నట్లు కనబడినా, కల్కి అవతారం గురించి చదివినప్పుడు, భగవత్పురాణంలోని 24 అవతారాల గురించి చదివినప్పుడు, కల్కి, ప్రవక్త ముహమ్మద్ (స)ల మధ్య సారూప్యాలు కనబడ్డాయి. ఆయనే కల్కి అవతారమని, ఆయన బోధనలు వైదిక ధర్మం బోధనలను ధృవీకరిస్తున్నాయని నేను గ్రహించాను. నేడు కాకపోయినా రేపయినా, ఈ వాస్తవాన్ని అందరూ గుర్తించినప్పుడు, ఇస్లామ్ కూడా భారతదేశంలోని ఇతర మతాల మాదిరిగా అంటే వైష్ణవం, శైవం, బౌద్ధం, జైనం మాదిరిగా అంగీకరించడం జరుగుతుంది. మతం అన్నది భౌతికశక్తి వల్ల లేదా ఆయుధాల వల్ల వ్యాపించదు. దేవుని దయవల్ల మతంలోని సత్యాన్ని ప్రజలు గుర్తించినప్పుడు, వారు విశ్వసించినప్పుడు ఆ మతాన్ని స్వీకరిస్తారు. హింసాదౌర్జన్యాల వల్ల ఎవరూ మతాన్ని స్వీకరించరు. మతం అన్నది వస్త్రధారణ, గెడ్డం, జీవనవిధానం కాదు. ఇవన్నీ పై పై లక్షణాలు మాత్రమే. మతం అన్నది మనస్సుకు సంబంధించినది.

హిందూ అన్న పదానికి అర్థం భారతదేశంలో నివసించే వారని. ఇక్కడ నివసించే ముస్లిం, క్రయిస్తవ ప్రజలందరికీ ఈ పదం వర్తిస్తుంది. హిందూ, హిందూస్తాన్ అన్న పదాలు పర్షియన్లు ఇచ్చినవి. కాబట్టి ముస్లిములు హిందువులుగా పిలువబడడానికి సంకోచించవలసిన పనిలేదు. భారతదేశంలోని కులవ్యవస్థ అన్నది వృత్తికి సంబంధించినది మాత్రమే, పుట్టుకకు సంబంధించినది కాదు. ఎవరు ఎలాంటి వృత్తిలో ఉంటే ఆ కులానికి చెందినవారవుతారు. దేవుని ఆరాధించేవారు, న్యాయప్రియులైన ముస్లిములు కూడా బ్రాహ్మణులే అవుతారు. దేవుని విశ్వసించేవారందరూ ముస్లిములే అవుతారు. వారందరూ ఆస్తికులే అవుతారు. గెడ్డం ఉన్న వారే ముస్లిములని కాదు. ప్రాచీన కాలంలో అన్ని మతాల పురుషులు గెడ్డం కలిగి ఉండేవారు. భారతదేశంలో నిమ్నోన్నతా భేదాలు

సమసిపోనంత కాలం, సమానత్వం చోటుచేసుకోనంత కాలం ఇక్కడ శాంతి సాధ్యం కాదు. ఈ విషయమై నేను మరో పుస్తకంలో వివరంగా వ్రాయదలిచాను. ఈ పరిశోదనా పత్రంలో ఆ వివరాలన్నీ పొందుపరచడం సాధ్యం కాదు.

**డా. వేదప్రకాష్ ఉపాధ్యాయ** ఎం.ఏ.(సంస్కృతం, వేదాలు)

డి.ఫిల్ (స్కాలర్ ఆఫ్ రెలిజియస్ స్క్రిప్ట్స్) **సరస్వత్ వేదాంత్ ప్రకాష్ సంఘ్**

# కల్కి అవతారం

ప్రొ. పండిత్ వేదప్రకాష్ ఉపాధ్యాయ్

సమీక్ష : మీర్ అబ్దుల్ మజీద్ బిబిసి న్యూస్‌లో ప్రసారం, డిసెంబర్ 8, 1997

**ప్రవక్త (స) గురించి ముందుగానే చెప్పబడింది.**

ది మెస్సేజ్, అక్టోబర్ 1997

వేదాలు పేర్కొన్న చివరి అవతారం, కల్కి అవతారం, ఎవరి కోసమైతే హిందువులు ఎదురు చూస్తున్నారో ఆ అవతారం ప్రవక్త ముహమ్మద్ '(స)

ఇటీవల ప్రచురితమైన ఈ పుస్తకం భారతదేశంలో చాలా అలజడికి కారణమైంది. ఈ పుస్తకాన్ని ఒక ముస్లిం కనుక రాసి ఉన్నట్లయితే తప్పకుండా జైల్లో పడేసి ఉండేవారు. పుస్తకాన్ని నిషేధించి ఉండేవారు. ఈ పరిశోదనా పత్రాన్ని రచించిన రచయిత ఒక బెంగాలీ. అలహాబాద్ విశ్వవిద్యాలయంలో కీలకమైన హోదాలో ఉన్న వ్యక్తి.

పండిత్ వేదప్రకాష్ ఉపాధ్యాయ ఒక బ్రాహ్మణ పండితుడు. మేధావి. సంస్కృతంలో ప్రావీణ్యం కలిగిన వారు. ఎంతో శ్రమకోర్చి పండిత్ వేదప్రకాష్ ఉపాధ్యాయ ఈ పరిశోధనా పత్రాన్ని ప్రచురించారు. ఈ పరిశోధనా పత్రాన్ని ఉన్నతస్థాయి మేధావులకు, పండితులకు, మతపెద్దలకు, రిసెర్చి స్కాలర్లకు ముందుంచారు.

ఈ పరిశోధనాపత్రంలో ఉన్న విషయాలు సత్యమని ఆయా పండితులు కూడా ధృవికరించారు. భారతదేశంలోని ముఖ్యమైన ధార్మిక గ్రంథాలు చివరి ప్రవక్తను కల్కి అవతారంగా ప్రస్తావించాయి. ఆ మహామనిషి ప్రవక్త ముహమ్మద్ (స) మక్కా నగరంలో జన్మించారు. కాబట్టి ఇక కల్కి అవతారం గురించి ఎదురు చూడవలసిన పనిలేదు. ప్రవక్త ముహమ్మద్ (స) బోధనలను అనుసరించడమే చేయవలసిన కర్తవ్యం. దాదాపు పద్నాలుగు వందల సంవత్సరాల క్రితం ఆయన్ను దైవం భూమిపైకి పంపించాడు.

దైవం తనపై మోపిన బాధ్యతను పూర్తిచేసి ఆయన తిరిగి దైవసన్నిధికి చేరుకున్నారు. తన పరిశోధనా పత్రం విశ్వసనీయత కోసం పండిత్ వేదప్రకాష్ ఉపాధ్యాయ వేదాల నుంచి రిఫరెన్సులు కోట్ చేసారు.

1. వేదాలు కల్కి అవతారాన్ని చివరి ప్రవక్తగా చూపిస్తున్నాయని, దేవుని తరఫున పూర్తి మానవాళికి మార్గం చూపించడానికి వచ్చిన అవతారం అని ఆయన అన్నారు. ప్రవక్త ముహమ్మద్ (స) విషయంలోనే ఈ ప్రస్తావనలు నిజమవుతున్నాయని పేర్కొన్నారు.
2. హిందూ ధర్మంలోని భవిష్యవాణుల ప్రకారం కల్కి అవతారం ఒక ద్వీపంలో జన్మిస్తుంది. అదే అరేబియా ద్వీపకల్పం. జజీరతుల్ అరబ్
3. హిందూ గ్రంథాల్లో కల్కి అవతారం తండ్రి పేరు విష్ణుభగత్‌గా చెప్పబడింది. తల్లి పేరు సుమతిగా చెప్పబడింది. అరబీలో విష్ణు పదానికి అర్థం అల్లాహ్, భగత్ అన్న పదానికి అర్థం అబ్ద్. విష్ణుభగత్ అన్న పదాన్ని అరబీలో అనువదిస్తే అబ్దుల్లా అవుతుంది. అదేవిధంగా తల్లి పేరు సోమానిబ్ అంటే అర్థం శాంతి అని, అరబీలో అనువదిస్తే అమీనా అవుతుంది. ప్రవక్త ముహమ్మద్ (స) తల్లిదండ్రుల పేర్లివే.
4. హిందూ గ్రంథాల ప్రకారం కల్కి అవతారం ఆలివు, ఖర్జూరాలు తింటారని ఉంది. ఆయన మాటపై నిలబడతారని, నిజాయితీ పరుడని ఉంది. ప్రవక్త ముహమ్మద్ (స)కు ఈ రెండూ వర్తిస్తాయి.
5. కల్కి అవతారం ఉన్నత కుటుంబంలో, గౌరవప్రదమైన వంశంలో జన్మిస్తాడని మతగ్రంథాలు చెబుతున్నాయి. ప్రవక్త ముహమ్మద్ (స) మక్కాలో అత్యంత గౌరవప్రదమైన ఖురైష్ వంశంలో జన్మించారు.
6. ఒక గుహలో కల్కి అవతారానికి భగవాన్ తన సందేశహరుని ద్వారా జ్ఞానబోధ చేస్తాడని ఉంది. ప్రవక్త ముహమ్మద్ (స)కు మాత్రమే ఇది వర్తిస్తుంది. హీరా గుహలో దేవుని సందేశహరుడు జిబ్రాయిల్ దూత ద్వారా ఆయన జ్ఞానబోధను పొందారు.
7. హిందూ గ్రంథాల ప్రకారం భగవంతుడు కల్కి అవతారానికి శరవేగంగా పయనించే గుర్రాన్ని ఇస్తాడు దానిపై ఆయన ప్రపంచాన్ని, సప్తాకాశాలను చుట్టి వస్తాడు. ప్రవక్త ముహమ్మద్ (స) బుర్రాక్ అన్న వాహనాన్ని ఎక్కి మేరాజ్ ప్రయాణం చేసిన సంఘటనను ఇది సూచిస్తోంది.
8. కల్కి అవతారానికి దైవిక సహాయం, శక్తి లభిస్తాయని ఉంది. బద్ర్ యుద్ధంలో ప్రవక్త ముహమ్మద్ (స)కు దైవిక సహాయం లభించిన వాస్తవాలు ఉన్నాయి.
9. కల్కి అవతారం గుర్రపు స్వారీలోను, ఖడ్గయుద్ధంలోను, విలువిద్యలోను ప్రావీణ్యం

కలిగి ఉంటాడని ఉంది. ఈ సందర్భంగా పండిత్ వేదప్రకాష్ ఉపాధ్యాయ రాసిన పంక్తులు గమనించదగ్గవి. ఈ కాలం కత్తియుద్ధాల కాలం కాదని, ప్రస్తుత కాలం ట్యాంకులు, గన్నుల కాలం అని ఆయన పేర్కొన్నారు. అంటే ఇప్పుడు చేతకత్తి పట్టి కల్కి అవతారం వస్తాడని ఈ కాలంలో ఎదురు చూడ్డంలో వివేకం లేదు. కాబట్టి కల్కి అవతారం అన్నది ప్రవక్త ముహమ్మద్ (స)ను మాత్రమే సూచిస్తోంది.

**వెబ్‌సైట్ :**

http//saif_wtripod.com/interfaith/hinduism/kalki_avtar.htm

# అరేబియాలో

రమజాన్ మాసం 27వ తేదీన, క్రీ.శ 610లో హీరా గుహలోదివ్యఖురాన్ అవతరించడం ప్రారంభమయ్యింది. ఈ పరంపర 23 సంవత్సరాల వరకు కొనసాగింది. జిల్‌హజ్జ మాసం 10 వ తేదీ, క్రీ.శ. 632లో పూర్తయ్యింది. ఇస్లాంలో మనిషి పుట్టింది మొదలు గిట్టే వరకు అన్ని రంగాలకు సంబంధించిన నియమనిబంధనలు ఇవ్వబడ్డాయి.

గత 1400 సంవత్సరాలుగా ఇస్లామ్ విశ్వసించదగ్గ ప్రామాణికమైన దర్మంగా నిలబడి ఉంది. దేవుని తరపునుంచి అవతరించిన ధర్మంగా , ఈ విషయంలో అనుమానం ఉన్న వారు దివ్యఖురాన్‌లోని ఒక్క వాక్యం మాదిరి వాక్యమైనా రచించి తీసుకురమ్మని సవాలు చేస్తోంది. ఈ సవాలును ఎవరూ ఎదుర్కోలేకపోయారు. ఇస్లామ్ ప్రళయం వరకు ఉండే ధర్మం. ఇహలోకంలో విజయాలకు, పరలోకంలో సాఫల్యానికి మార్గం చూపే ధర్మం ఇస్లామ్.

**ఆధారాలు :** సూరా అల్ అలఖ్ 1 - 5 అల్ మాయిదా 3, ఆలి ఇమ్రాన్ 19

అల్ బఖర 12-25

# ప్రపంచవ్యాప్తంగా..

యావత్తు మానవాళి కొరకు దేవుడు ఇస్లామ్‌ను పంపించాడు. శాంతి, సోదరభావం, సత్యం, సంతోషాల కలయిక ఇస్లామ్. ఇందులోని సత్యం, గొప్పదనం, ప్రామాణికతల కారణంగా ప్రపంచమంతా విస్తరించింది. నేడు కూడా విస్తరిస్తూనే ఉంది. ప్రళయం వరకు విస్తరిస్తూనే ఉంటుంది. ఇస్లామ్‌ను రక్షించే బాధ్యత స్వయంగ దేవుడు తీసుకున్నాడు కాబట్టి దీనిని ఎవ్వరూ నాశనం చేయలేరు.

**ఆధారాలు:** అల్ హజర్ 9 అల్ బఖర

# ఇస్లామ్

## మానవాళికి ఒకేఒక్క వాస్తవ ధర్మం.

## ఇహలోకంలో విజయాలకు, పరలోకంలో సాఫల్యానికి

### భారతదేశంలో

హజ్రత్ ఆదమ్ (అస) స్వర్గం నుంచి భూమిపైకి పంపబడినప్పుడు సరన్‌దీప్ (శ్రీలంక) కొండపై దిగారు. ముహర్రమ్ 10వ తేదీ రాత్రి ఈ సంఘటన జరిగింది. అందుకే ఈ కొండను ఆదమ్ పీక్ అంటారు. ఆదమ్ (అస) పాదముద్రలు అక్కడ ఉన్నాయంటారు. హవ్వా (అస) సౌదీ అరేబియాలోని జిద్దా ప్రాంతంలో భూమిపై దిగారు.

**ఆదమ్ పీక్ :** కొలంబోకు 20 కి.మీ దూరంలో దక్షిణశ్రీలంకలో ఈ కొండశిఖరం ఉంది.

**ఆదమ్ పాదముద్ర :** ఆదమ్ (అస) పాదముద్ర 5'4" పొడుగు, 2'6" వెడల్పు కొలతలతో కొండపై కనబడింది.

**ఆదమ్ బ్రిడ్జి :** శ్రీలంక నుంచి భారతదేశానికి ఇసుకు వారధుల మాదిరి నిర్మాణాలు ఉన్నాయి. వాటి ద్వారా ఆదమ్ (అస) పయనించేవారు. అందుకే వీటిని ఆదమ్ బ్రిడ్జి అంటారు.

**ఇస్లాం :** ప్రతి ప్రవక్త ఈ భూమిపైకి దేవుని సందేశాన్ని తీసుకువచ్చారు. అదేవిధంగా హజ్రత్ ఆదమ్ (అస) దేవుని ధర్మాన్ని ఇక్కడకు తీసుకువచ్చారు. భూమిపై ఉన్న సమస్తం గురించి జ్ఞానాన్ని ఆయనకు దేవుడు ఇచ్చాడు. (ఉదా : పేర్లు, వాటి ప్రయోజనాలు, నష్టాలు వగైరా)కాబట్టి మనం మాట్లాడుతున్న భాషలు, మనం భుజిస్తున్న ఆహారం, ఈ సృష్టిలోని వివిధ వస్తువుల గురించి మనకున్న జ్ఞానం అంతా ఆదమ్ (అస) తీసుకు వచ్చినదే.

ఆధారాలు : అల్జామిల్ ఖురాన్, పేజి 27, జిలాని, దారుస్సలామ్ పబ్లిషర్స్, రియాజ్, జిద్దా దివ్యఖురాన్ సూరా బఖర 36,
తఫ్సీర్ ఇబన్ కసీర్, పేజి 336 ఆలి ఇమ్రాన్ 19, మాయిదా 13 ఇస్లామీ ఎన్సైక్లోపీడియా పేజిలు 20,22,822,832

**అరేబియాలో పూర్తయ్యింది.** అరేబియాలో రమజాన్ మాసం 27వ తేదిన, క్రీ.శ 610లో హిరా గుహలోదివ్యఖురాన్ అవతరించడం ప్రారంభమయ్యింది. ఈ పరంపర 23 సంవత్సరాల వరకు కొనసాగింది. జిల్‌హజ్జ మాసం 10 వ తేదీ, క్రీ.శ. 632లో పూర్తయ్యింది. ఇస్లాంలో మనిషి పుట్టింది మొదలు గిట్టే వరకు అన్ని రంగాలకు సంబంధించిన నియమనిబంధనలు ఇవ్వబడ్డాయి.

గత 1400 సంవత్సరాలుగా ఇస్లామ్ విశ్వసించదగ్గ ప్రామాణికమైన ధర్మంగా నిలబడి ఉంది. దేవుని తరఫునుంచి అవతరించిన ధర్మంగా , ఈ విషయంలో అనుమానం ఉన్న వారు దివ్యఖురాన్‌లోని ఒక్క వాక్యం మాదిరి వాక్యమైనా రచించి తీసుకురమ్మని సవాలు చేస్తోంది. ఈ సవాలును ఎవరూ ఎదుర్కోలేకపోయారు. ఇస్లామ్ ప్రళయం వరకు ఉండే ధర్మం, ఇహలోకంలో విజయాలకు, పరలోకంలో సాఫల్యానికి మార్గం చూపే ధర్మం ఇస్లామ్.

ఆధారాలు : సూరా అల్ అలఖ్ 1 - 5, అల్ మాయిదా 3, ఆలి ఇమ్రాన్ 19, అల్ బఖర 12-25

ప్రపంచవ్యాప్తంగా.. యావత్తు మానవాళి కొరకు దేవుడు ఇస్లామ్‌ను పంపించాడు. శాంతి, సోదరభావం, సత్యం, సంతోషాల కలయిక ఇస్లామ్. ఇందులోని సత్యం, గొప్పదనం, ప్రామాణికతల కారణంగా ప్రపంచమంతా విస్తరించింది. నేడు కూడా విస్తరిస్తూనే ఉంది. ప్రళయం వరకు విస్తరిస్తూనే ఉంటుంది. ఇస్లామ్‌ను రక్షించే బాధ్యత స్వయంగా దేవుడు తీసుకున్నాడు కాబట్టి దీనిని ఎవ్వరూ నాశనం చేయలేరు.

ఆధారాలు: అల్ హిజ్ర్ 9, అల్ బఖర



ఆదం పాదం గుర్తులు



తొలి మానవుడు దిగిన పర్వతం



ఆదం బ్రిడ్జి



ఆదం పర్వతపు శిఖరం



ఆదం పర్వతం



ఆదం బ్రిడ్జి, సెటలైట్ చిత్రం



ఆదం బ్రిడ్జి, భూగోళ పటం